Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

'నిదానం'

పంపినవారు:
జి. వి. రమణ - అనంతపురం

త్వరలో విడుదల!!

రాజా ప్రొడక్షన్సు

# పుట్టిల్లు

ప్రొడ్యూసర్ & డైరెక్టర్
డాక్టర్ రాజారావ్

ఆంధ్ర జనత డిస్ట్రిబ్యూటర్స్ బెజవాడ

సీడెడ్ తెలంగాణా & మద్రాసుసిటీ మిత్రా డిస్ట్రిబ్యూటర్స్ నెల్లూరు

## పాఠకులకు మనవి



పైనెల చందమామ కాపీలు యీనెల చివరివారంలో పోష్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, వెంటనే మాకు తెలియపర్చ గోరుతాము.

చందమామ పబ్లికేషన్స్

## ఈ సంచికలో యివి చదువుకోండి



ఇవన్నీగాక ఇంద్రజాలం, ఫోటో వ్యాఖ్యలపోటీ
ఆకర్షవంతమైన మరికొన్ని క్రొత్తశీర్షికలు వున్నై.

# చందూ యొక్క సాహసకృత్యములు


















## ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

# చందమామ

సంచాలకుడు :: చక్రపాణి

సంపుటి 11 : డిశంబర్ 1952 : సంచిక 6

మేము కోరినదే తడవుగా పాఠకులు పంపిన సలహాలతో 'కథలతాతయ్య' తపాలాసంచి నిండుగా వుంటున్నది. వచ్చిన ప్రతి ఉత్తరంలోనూ ఉత్సాహం కనిపిస్తున్నది. ఇటుపైన ఒకపేజి, అరపేజి కథలుకూడా మళ్ళీ వేయదలిచాము. కథ ఎంత చిన్నదైతే, అది బాగున్న దనిపించటానికి అంతకష్టం. కనుక, ఈరకం చిన్న కథలు వ్రాసి పంపటంలో ఎక్కువ శ్రద్ధ వహించవలసి వుంటుంది. ముఖ్యంగా, మన సారస్వతంలో హాస్యరసం పోషించే కథలు చాలాతక్కువ. ఈ విషయంలో కృషిచేసి, ఇంతవరకు వెలువడని చక్కటి హాస్యకథలు పంపితే, వాటిని చందమామ ఆనందంతో అందుకొంటుంది. ఈ సంచికలో ప్రకటించిన 'వదిన గొప్పది' అనే కథ నిజానికి ఒక గొప్ప కథ. ఇటువంటి చక్కటి జానపద గాథలతో మన చందమామను అలంకరించటానికి యత్నిద్దాము.



# పిల్లిపిల్లల పోరు




హోరుగాలి కొడుతున్నది.
జోరున జడి పడుతున్నది.
పెనుతుపాను దెబ్బలు తిని
జగతి ఉలికిపడుతున్నది.

ఊగుతున్న దిలొక్కటి
ఆ తాపుల కుయ్యేలగా.
జోగుతున్న దొక అబిడ
ఇంటిలోన మగతలుగా.

ఇంతటిలో ఇంటిలోన
నివసించే రెండు పిల్లి
పిల్లలకూ వచ్చిం దొక
తగవు చిన్నఎలుకవల్ల.

చిక్కిందొక పిల్లిపిల్ల
కది; అంతట ఎరిగి జాడ
పరిగిడి చేరిందక్కడ
జంట పిల్లికూన కూడ.

తగవులాడ సాగినాయి
అవి రెండూ ఒకతృటిలో.
వాదులాడ సాగినాయి
ఒండొంటిని చీకటిలో.

ఒకటన్నది—'ఎలుక నాది.
దీనిని పట్టింది నేను.'
రెండవదన్నది—'నాకూ
హక్కుందంటాను నేను!'

మొదటిదన్న ద్రాగహించి
'చూస్తా నేం చేస్తావే?'
రెండవ దన్నది—'చూదాం,
ఎలా దెబ్బ కాస్తావే?'

గుర్రు గుర్రుమని రెండూ
పోరుకాడ సాగినాయి.
కప్పు ఎగిరిపోయేట్టుగ
కలబడి చెలరేగినాయి.

అదనుచూచి ఎలుక పారి,
ప్రాణం దక్కించుకొంది.
పిల్లుల కాట్లాటవల్ల
ఇంటావిడ మేలుకొంది.

చెవులుపట్టి రెండిటినీ
బయట విసరి, మూసికొంది
తలుపులు, మరిరాకుండా
లోన గడియ వేసికొంది.

చలిలో జడిలో గడగడ
పిల్లిపిల్ల లడలినాయి.
కొనఊపిరితో ఉదయం
ఇంటివైపు తరలినాయి.

పిల్లిపిల్లలకు రెంటికి
పొందు కుదరలేదు గనుక,
చేజిక్కిన ఎలుక పోయి,
చలిలో వణికాయి వెనుక.




రచన: "బైరాగి"

# పూలమాల



అనగనగనగా ఒక రాజు. ఆ రాజుకు అపురూపమైన భద్రావతి అనే అందాల కూతురు. యుక్తవయస్సురాగానే ఆమెకు పెళ్ళిచేస్తామని స్వయంవరం చాటింపించారు. దేశదేశాలనుండి అనేకమంది రాజకుమారులు వచ్చారు.

తను మూడు ప్రశ్నలు వేస్తాననీ, ఆ ప్రశ్నలకు నచ్చిన జవాబులు యెవరు చెప్పగలరో వారిని పెళ్ళాడుతాననీ భద్రావతి ప్రకటించింది. ఏమి ప్రశ్నలు వేస్తుందోనని అందరూ చెవులు రిక్కించుకొనివున్నారు.

అందరూ విందు యేర్పాటయిన హాలులోకి వెళ్ళి కూర్చున్నారు. రాజకుమారి కూడా అక్కడికి వెళ్లి, ఉచితాసనం అలంకరించి, రెండు చేతులతోనూ పూలమాల పట్టుకుకూర్చున్నది. ఆ వచ్చిన రాజకుమారులందరినీ ఒకరితరువాత ఒకరిని వరసగా పిలిచి మొదటి ప్రశ్న వేసింది; 'ఈ విందు అరగించటానికి మీకుగల అర్హత యేమిటి?' అని. ఎవరిగొప్పలు వారు చెప్పుకొన్నారు. తమతమ హెూదాలు వెల్లడించారు. చివరకు మిగిలిన చంద్రగుప్తుడు అనే రాజకుమారుడు 'రాజకుమారీ! నేను ఆకలితో వున్నాను. ఇదే నాకు గల అర్హత' అన్నాడు. భద్రావతి ముఖంలో తృప్తి కనబడింది.

తరువాత 'పెళ్ళి ఐనతరువాత నన్నెలా చూస్తారు?' అని అడిగింది. ఇందుకు కొందరు 'దేవతగా పూజిస్తా'మన్నారు. 'యజమానిగా ఏలుకో'మని అన్నారు మరికొందరు. 'నీకు గులాముగా వుంటా'మని మాటయిచ్చారు యింకొందరు. చివరకు చంద్రగుప్తుడు 'నిన్నొక ప్రాణమిత్రునిగా, నీవేనేను, నేనేనీవుగా యెంచుకొంటాను' అని చెప్పాడు. ఈ మాటకు భద్రావతి ముఖం వికసించింది.

ఇక మూడవ ప్రశ్న: సరే, పెళ్ళాడితే నాకు యేమిటిస్తారు?' అని అడిగింది. ఈ ప్రశ్నకు రాజకుమారులందరూ పోటీపడి, 'చంద్రహారమిస్తా'నని ఒకరు, 'నా సర్వస్వమూ నీదే' అని మరి వొకరు, 'నీవేంకోరుకుంటే అదే యిస్తా'నని ఇంకొకరూ ఇష్టమొచ్చినట్టుగా వర్ణించారు. చివరికి చంద్రగుప్తుడు ఒకే ఒక్క మాటలో 'నా హృదయమిస్తాను' అన్నాడు.

ఆమె చేతులలో పూలమాల అప్రయత్నంగా చంద్రగుప్తుని మెడలో పడింది. జయజయధ్వనులు ప్రతిధ్వనించినై.



# పాడుపడిన పూరిగుడిసె

అనంగరాజ్యాన్ని పూర్వం ఒకప్పుడు చక్రధర మహారాజు ఏలుతూ వుండేవాడు. ఆయన నివసించే రాజభవనం ఏడుతరాల క్రిందట నిర్మించింది. పూర్వులు ఆ భవనాన్ని ఏనాడు నిర్మించారో, అంతే. మళ్ళీ అది మరమ్మత్తు అనే మాటే ఎరుగదు.

రానురాను ఆ రాజభవనం శిథిలమైపోయి, కంటితో చూడటానికే అసహ్యం వేసే స్థితికి వచ్చింది. ఇంతకాలమైన తరవాత ఇప్పుడు మరమ్మతుమాట తలపెట్టినట్టయితే, అది అయేపనికాదని మహారాజు ఉపేక్షచేసి వూరుకొన్నాడు.

కాని, చూడగా చూడగా, చక్రధరునికి ఈ సమస్య వెగటుపుట్టించింది. ఇక ఒక్క నిమిషమైనా ఆ భవనంలో నిలవటం రోత అనిపించింది. పైగా, ఎక్కడైనా మనసుకు అహ్లాదకరమైన స్థలం చూచుకొని నివాసం ఏర్పరుచుకోవాలని బుద్ధిపుట్టింది.

ఈసంకల్పం కలిగిన వెంటనే చక్రధర మహారాజు క్షణమైనా ఆ భవనంలో నిలవలేదు. పరివారాన్ని తీసుకొనిబయలుదేరాడు. పోయిపోయి, ఒక నదీతీరం చేరుకొన్నాడు.

నదీతీరమందు ఆయనపొందిన ఆనందం మాటలతో చెప్పటానికి అలవి కాదు. ఇక్కడికి రాగానే ఆయన శరీరమూ, మనస్సూకూడా ఒక కొత్త జీవంతో ప్రకాశింపసాగినై. ఈ కారణంచేత రాజు నదీతీరానికి చేరువలోనే ఒక కొత్త భవనం నిర్మించాలని సంకల్పించి, ఈ ప్రదేశం ఎవరిదో ఏమిటో కనుక్కోమన్నాడు.

అక్కడనే, గుబురుగా పెరిగిన చెట్ల సందున ఏదో ఇల్లు కనిపించేసరికి అందరూ కలిసి అక్కడికిపోయి చూచారు. అది ఒక చిన్నకుటీరం.

ఆ కుటీరంలోపల తొంభైఏళ్ల ముసలిది ఒకర్తె ఉన్నది. తన కుటీరండగ్గరకు వచ్చిన

సి. హెచ్. మాధవరావు - గుంతకల్లు




ఆ జనం రాజూ, పరివారమూ అని తెలిసి, ఆమె చాలా సంతోషించింది. వారిని తగు మర్యాదలతో ఆదరించి, 'మీరెందుకు బాబూ, ఇలా దయచేశారు?' అని అడిగింది.

అప్పుడు మంత్రి అమెతో "అవ్వా!— ఇక్కడ మా ప్రభువులకు ఎంతో సుఖంగా వున్నదని సెలవిస్తున్నారు. రాజభవనం నిర్మించేటందుకు ఇక్కడ విశాలమైన స్థలం కావాలి. కనుక, దారిలో వున్న నీ కుటీరాన్ని తీసివేయవలసిఉన్నది" అని చెప్పాడు.

అందుకు ముసిలిది "అయ్యో నా తండ్రీ!—రాజావారు భవనం కట్టుకుంటా మంటే నే వద్దంటానా? అంతకంటె నాకు మాత్రం కావాల్సిందేమున్నది? అయితే— ఈ కుటీరం ఏడుతరాలనాడు మా పూర్వులు కట్టించింది. ఇప్పుడు నాతరం వచ్చేసరికి, నేను చితికిపోయి వుండటంచేత కానీడబ్బు పెట్టి మరమ్మతుఐనా చేయించలేక పోయాను. లేకపోతే పోయింది, నేను మట్టుకు ఈ పూరిపాక వదిలి పోలేను. ఎప్పటికైనా పంతుపడితే నేయించుకొంటా, లేకుంటే లేదు. కాని, ఈ స్థలంమాత్రం వదిలిపోలేను' అని చెప్పింది.

అప్పుడు మంత్రి మళ్ళీ వృద్ధురాలితో "ముసిలీ!—సరే, నువు చెప్పిన మాట బాగానేవుంది. కాని, పిచ్చిపిచ్చి వూహలు పెట్టుకుని 'నేను ఇక్కడినుంచి కదలనూ' అంటేకాదు. అలా అనటం కేవలం మూర్ఖత అనిపించుకొంటుంది. ఈ కాస్త స్థలమూ వదిలేశావంటే, రాజావారు వారి రాజ్యంలో, నీకు యెక్కడ కావలిస్తే అక్కడ అంతకు పదిరెట్లు విస్తీర్ణంగల స్థానం ఇస్తారు. లేదా, 'నాకు స్థలం అక్కరలేదు, డబ్బేకావాలి' అంటావా కోరుకో. నీ యిష్టంవచ్చినంత ధనం యిప్పుడు తెప్పించియిస్తా' నన్నాడు.

అందుకు ముసిలిది 'నాయనా!—నీ పెద్దపెద్ద స్థలాలూ నాకువద్దు. నీ ధనపు




రాసులూ నాకు పనిలేదు. లక్ష రానీ పోనీ, ఈ కుటీరంలోనించి మట్టుకు నేను కదల బోయేదిలేదు. రాజుగారికి కావాలంటే నే వద్దనలేదే! నా కుటీరంజోలికి రాకుండా, ఈ విశాలప్రదేశంలో ఎక్కడైనా కట్టుకో మను భవనం' అని నిర్భయంగా చెప్పింది.

చెప్పేసరికల్లా పరివారం అందరూ ముసిలిదానికేసి మిర్రిచూచారు. 'మాటాడు తున్నది ఎవరితోనో ఒళ్ళుతెలియకుండా వుందే, దీనికి. దీనిబతుకెంత, దీని పూరిపాక ఎంత? లాగిపారెయ్యండి' అంటూ మంత్రి మండిపడ్డాడు.

అప్పుడు మహారాజు వారందరినీ శాంతపరిచాడు. అవ్వచెప్పిన మాటలను శ్రద్ధగా ఆలకించి, వాటిని సరీగా అర్థంచేసు కొన్నది మహారాజు ఒక్కడే. అవ్వచెప్పిన మాటలకు మహారాజు హృదయంలో గొప్ప సంచలనం కలిగింది.

అవ్వకు తన జన్మస్థలంమీదఉండే అభి మానానికీ, ఆమెకు తన పూర్వీకులమీద వుండే భక్తికీ ఆయన విస్తుపోయాడు. ఈ మాటలు విన్నతరువాత, తను తలపెట్టిన పని ఎంతో తప్పిదంగా తోచింది. 'ప్రాజ్ఞు డనూ, ప్రభువునూ అయివున్న నాకు ఆ ముసలిదానిపాటికూడా ఆలోచన లేకపో యిందే'నని విచారించాడు.

మంత్రినీ, పరివారాన్నీ చేరబిలిచి, 'ఈ ముసిలిది నాకు ఒక గొప్పపాఠం నేర్పింది. నేను నాయిల్లు చక్కబెట్టుకొని, నా పూర్వీ కుల గౌరవం నిలబెట్టాల్సింది విధి. నా విధిని నేను మరిచాను. అదృష్టవశంచేత మనం ఇక్కడికి రావడంతో ఈ అవ్వ నా విధిని నాకు జ్ఞాపకంచేసింది.

'నే నిక నా రాజభవనానికి పోను. ఇక్క డనే ఈ చెట్లకిందనే మకాంచేసుకొని వుంటాను. ఇక్కడనే వుండి నా రాజభవనం మరమ్మతు చేయిస్తాను. నా పూర్వీకులు

కట్టిన ఆ భవనాన్ని కలకల్లాడేటట్టు చేసి కాని, మళ్ళీ అందులో ప్రవేశించను,' అని తన నిశ్చయం వెల్లడించాడు.

రాజుమాటలు పరివారంలో కొందరే గ్రహింపగలిగారు. తక్కినవారు ఆయనను పిచ్చివానిగా తలిచారు. ఆ క్షణంనుండి రాజు ఆ చెట్లకిందనే బస యేర్పరచుకొని, చల్లని పిల్లవాయువులు అనుభవిస్తూ కాల క్షేపం చేయసాగాడు.

రాజు ఇక్కడ మకాంచేయగానే, నగరం లోని ప్రజలంతా ఇక్కడికే వచ్చేశారు. బస్తీకంటె ఇక్కడనే బాగావున్నదని గ్రహించారు. రాజుతోపాటు అందరూ ఇక్కడ చెట్టుకిందనే చిన్నచిన్న కుటీరాలు వేసుకొని నివాసం ఏర్పరుచుకొన్నారు.

కొద్దిరోజులకల్లా ఆ ప్రదేశమే ఒక చక్కటి పట్టణంగా తయారయింది. ఐతే, ఇది బస్తీలక్షణాలతో నిండిన పట్టణంకాదు. పల్లెటిలక్షణాలు గల బస్తీఅన్నమాట.

ఇక్కడ కొన్ని యిళ్ళు లేచినై. రాజ భవనమూ వెలిసింది. కొత్తకట్టడాలు ఎన్ని వెలిసినప్పటికీ, ఏడుతరాలనుండీ పడివున్న అవ్వకుటీరాన్నిమట్టుకు రాజు కదపలేదు, ఎవరినీ కదపనీయలేదు.

తన కృతజ్ఞత తెల్పటానికని చక్రధర మహారాజు అవ్వకుటీరం మరమ్మతు చేయించాడు. అంతేకాదు. ఆ చెట్లకింద వెలసిన నగరానికి అవ్వ పేరు మీదుగా 'అవ్వాపురం' అని పేరుపెట్టాడు.

చక్రధరమహారాజు తన తరంలోనే దీక్ష పట్టి అనంగరాజ్యంలోని తన పూర్వీకుల రాజభవనం బాగుచేయించాడు. అదీ కల కల్లాడుతూ ప్రకాశించింది.

అయితే—మహారాజు తన జీవితాంతం వరకూ రాచకార్యాలు అనంగరాజ్యంలోని తన పూర్వీకుల భవనంలో చక్కబెట్టు కొంటూ, నివాసంమట్టుకు అవ్వాపురంలోనే పెట్టుకొన్నాడు.






## 2

ఆ క్షణంలో—'ఆగు, ఆగు! మహీపాలుని తలపైన వున్న రత్నకిరీటం తీయాలి' అంటూ కేకవేశాడు, కిరాతరాజు. అందరూ నిశ్చేష్టులయ్యారు. అందరితోపాటు దుఃఖ సాగరంలో మునిగివున్న ప్రమోదుడూ విస్తుపోయాడు.

వెంటనే పురోహితుడు, ఎత్తిన కత్తిని కింద వుంచి, మహీపాలుని తలపైనున్న రత్నకిరీటం తీదామని రెండు చేతులూ చాచాడు.

అప్పుడు గుండె దద్దరిల్లేటట్టు 'నాయనా! నిన్నా బలివేయటం?' అంటూ మానవ భాషలో గొప్ప శబ్దం వినిపించింది.

నలుదిశలా కలయచూచారు జనం.

అంతలోనే, జనసమూహం కంగారుగా చెల్లాచెదురు కాజొచ్చింది. 'హంస! హంస!! బంగారు హంస!!!' అని అందరూ ఒక్క సారిగా ఎలుగెత్తి అరిచారు. దానిని చూసి వారు స్తంభించిపోయారు.

అది చిత్రవిచిత్రమైన వన్నెలచిన్నెల రాజహంస! బంగారు రాజహంస!! ఇందాక వినబడిన పలుకులు ఈ రాజహంస పలికి నవేననీ, దాని కంఠస్వరం పెద్దరాణి ఐన గంధర్వకాంత కంఠస్వరమేననీ పిల్ల వాళ్లకుకూడా తెలిసిపోయింది. అయితే—అది ఎలా అక్కడికి వచ్చిందోమాత్రం ఎవరూ కనిపెట్టలేకపోయారు.

మహీపాలుడు 'అమ్మా! అమ్మా!!' అనుకొంటూ పోయి, గట్టిగా ఆ హంస మెడను చుట్టేసుకొన్నాడు. వెంటనే రత్న కిరీటధారి ఐన మహీపాలుణ్ణి వీపుపైన ఎక్కించుకొని, అది ఎగిరి చక్కాపోయింది!!




ఎగిరిపోతున్న హంసను చూచి, పురోహితుడైన రాజగురు ఆవేశంతో—'కొట్టండి! పట్టండి '! మాయపక్షి !!!' అని కేకలువేసి అందరనూ తొందరచేశాడు. తొందరచేశాడే కాని, ఆ పక్షినేమి చేయటానికీ ఒక్కళ్లకూ కాలుచేతులాడలేదు. చూస్తూవుండగా, అది అంతరిక్షానికి వెళ్లిపోయింది.

ఆ పక్షివాక్కులు విన్న క్షణంనించీ అందరూ తీవ్రమైన ఆలోచనలో పడ్డారు. ఇందుకుతోడు, రాజగురు ఆవేశపడటం వారి ఆలోచనను మరింత తీవ్రతరం చేసింది. రాజ్యంలో పుట్టిన పుకారుకీ, ఈ సంఘటనకూ సంబంధమేమిటా అని ప్రతివారికీ జిజ్ఞాస కలిగింది. కాని, ఎవళ్ళకూ సరిఐన సమాధానం దొరకనేలేదు.

ఏమైతేనేమి, అమాయకుడైన పసివానికి గండం తప్పిందికదా అని ఆబాలగోపాలమూ సంతోషించారు.

ఈ సందర్భంలో ముందు రాజగురును పట్టి బంధించమని ఆజ్ఞాపించాడు రాజు. ఇలా ఆజ్ఞాపించగానే మందాకిని ఆలోచనలో పడింది. క్షణంకూడ నిలవక, ఒక్క లిప్తలో ఆమె అంతఃపురం చేరుకున్నది.

ఇదంతా కనిపెట్టి చూస్తూవున్న ఆమె తండ్రి కిరాతరాజు, ఏదో గడబిడ వున్నట్టు పసికట్టి, ఆమె వెనకాతలే తనూ వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికే మందాకిని శయ్యామందిరంలో పడుకొని వున్నది.

తండ్రి ఆమెను చేరదీసుకొని, 'అమ్మడూ! జరిగిందేదో జరిగింది, విచారించకు. అదీ వకమేలే — పసివాడు ప్రాణాలతో వెళిపోయాడు...'అని ఇంకా ఏమో చెప్పబోతూ వుండగా, మందాకినికి శరీరంలో ఒక విధమైన బాధ ప్రారంభమయింది.

'నాన్నా! క్షమించు. ఇంతవరకు లోకంలో మంచిదాని ననిపించుకొన్నాను. ఇప్పుడు నలుగుర నోళ్లలో పడటం యిష్టం

లేదు. తీరా తొందరపడి రాజగురు చిక్కుకోనే చిక్కుకొన్నాడు. రేపు జరగ బోయే విచారణలో నిజానిజాలు బయల్ప డక తప్పదు. అందుకనే...' అనేటంతలో ఆమెకు వంట్లో భరింపరాని ఆవేదన పుట్టుకొని వచ్చింది.

ఆవేదనతోనే ఆమె అతిప్రయత్నం చేసి 'నాన్నా!—పసివాణ్ని చూచుకో, జాగర్త! అన్నయ్యనికూడా ఇక్కడికే వచ్చేసి ఉండి పొమ్మను. నాకు కాలం సమీపించింది. మాటాడలేను. నేను చేసిన పనిమట్టుకు గొడవకానీయకు! నాన్నా!—పసివాడు... అర్థకర్తుడు...'అంటూ, ప్రాణం విడిచింది.

తన కూతురు మహీపాలుడికి కలిగిన కష్టాలు చూడలేక గుండెపగిలి మరణించిం దని కిరాతరాజు విలపింపసాగాడు.

అంతలో ప్రమోదుడూ వచ్చాడు. "దుర దృష్టవంతుణ్ణి...చేతులారా పెద్దరాణిని పోగొట్టుకున్నాను. పసివాడైనా ఉన్నాడుకదా అని ధైర్యపడేటంతలో విపరీతమైన ఈ అవాంతరం వచ్చిపడి, వాడు కాస్తా ఎగిరి పోయె! పోనీ, ఇక వాణ్ణిగురించి భయం లేదు, తల్లిదగ్గరకు చేరుకొన్నాడుకదా అని సంతోషించేటంతలో, నా మందాకినికూడ



నన్ను మోసగించిపోయిందే... నాగతి యింకేమికాను? ఎవరు నాకు దిక్కు? ఆ మాయదేవుడు ఇన్నిపాట్లు తెచ్చిపెట్టటానికి నేనేం పాపంచేసుకొన్నాను...?' అంటూ వలవల యేడ్చాడు.

నిమిషంలో యీవార్త నగరమంతా అల్లుకుపోయింది. మరణించిన మందాకిని పైన అందరకూ జాలికలిగింది.

మరికొద్ది రోజులకే విచారణ వచ్చింది. ఉన్నది ఉన్నట్టు చెప్పాడు రాజగురు. కుట్ర అంతా చిన్నరాణిదే నన్నట్లు అయన సంజాయిషీవల్ల తేలింది. కూతురు పన్నిన కుట్రలో సాయపడటానికే కిరాతరాజు




ఇక్కడ తిష్ఠవేశాడని చెప్పి, తన మాటలు బలపరుచుకోవటానికి చూచాడు రాజగురు. కాని, ఆయనమాటలు ఒక్కళ్లూ నమ్మలేదు. చనిపోయిన రాణి మీద నేరం తోసేసి తను తప్పించుకోవటానికి చూస్తున్నాడని అందరూ ఉద్దేశపడ్డారు.

రాజు ఉగ్రుడయ్యాడు: 'పట్టం కట్టుకోవలసిన మహీపాలుణ్ణి పొట్టనుపెట్టుకోబోయిన మహాపాపివి నీవు. రాజ్యకాంక్షతో అమాయిక ప్రజను రెచ్చగొట్టావు, ఘోషపెట్టావు. రాజ్యమంతా అల్లకల్లోలం చేసివేశావు. నా హృదయంలో చిచ్చుపెట్టావు. నిన్నేమిచేస్తే పాపముంది ద్రోహీ! ఫో, నా ఎదట మరి కనపడకు. నా రాజ్యంవదిలి ఫో!!' అంటూ మండిపడి, రాజగురుని కోట అవతలకు గెంటించివేశాడు. ప్రజలు ఆయనను చూచి 'ఛీ-ఛీ' అన్నారు.

రాజు పరాభవింపగా, లోకులు ఈసడింపగా, తలవంపులతో భల్లాణరాజ్యం వదలిన రాజగురు, మరి వెనుతిరిగి చూడనే లేదు. జన్మలో ఇంతవరకెన్నడూ ఇటువంటి అనుభవం ఎరిగివుండలేదాయన.

ఆ సమయాన తన కుంటుంబం ఏమైపోతుందోననే చింతకూడా లేకపోయింది ఆయనకు. భార్యాబిడ్డలను చూచుకుపోదామనే దృష్టే కలగలేదు. 'భల్లాణరాజ్యమనే ఈ గడ్డపైన క్షణమైనా నిలవకూడదు'— ఇదే ఆయన చేసుకొన్న నిశ్చయం. ఇదితప్ప మరే ఆలోచనకూ మనసులో తావు లేకపోయింది. ఇంతటి వైరాగ్యభావంతో, రాజగురు ఒక లక్ష్యమూ సంకల్పమూ లేకండా, కాళ్ళు ఎక్కడికి తీసుకుపోతే అక్కడికే సాగిపోతున్నాడు!

పోయిపోయి, రాజగురు ఒక అటవీ ప్రాంతం చేరుకొన్నాడు. అలసి, ఒక చెట్టుకింద కూలపడ్డాడు. సోలిపోయిన ఆ సుకుమారప్రాణికి కునుకుపట్టినట్టయింది.

కొంచెంసేపటికల్లా గుర్రపుడెక్కల టకటక శబ్దం వినవచ్చింది.

అంతలో, ఒక యువకుడు ఆ దారిన వచ్చాడు. వచ్చి రాజగురును చూస్తూనే గురుతుపట్టాడు. అతడే కిరాతరాజు కొడుకు మందపాలుడు. ఆ ప్రదేశమే కిరాతరాజ్యం.

నిమిషంలో రాజగురునకు సమస్త ఉపచారాలూ జరిగినై. మరుక్షణంలో ఆయన కిరాతరాజు దివ్యకుటీరంలో ఉన్నాడు! అటుతరువాత రాజగురు ఎంతో దీనంగా తన స్థితిగతులన్నీ మనసు విడిచి మందపాలునికి వెల్లడించాడు.

అందుకు మందపాలుడు ఆయనను ఊరడిస్తూ "గురూజీ!—ప్రపంచాలను నడిపించగల ప్రజ్ఞావంతులు మీరు. మీరు తలచినంతమాత్రాన జగాలు కంపించి పోతయి. తాము ఇలా వాపోవడం పాడి కాదు. ధైర్యం వహించండి. మీ ఆశీర్వాద బలం వుంటే సరి, ఇదిగో కత్తి చేతపట్టి చెబుతున్నా: యేరోజున మందపాలుడు భల్లాణరాజ్య సింహాసనం అధిష్ఠిస్తాడో, ఆ క్షణమందే మీకు సమస్త సౌఖ్యాలూ సమకూరినవని నమ్మండి...' అంటూ భీషణ ప్రతిజ్ఞ పట్టాడు.



ఈ శపథానికి రాజగురు సంతోషించాడు. ఐతే, గాఢమైన ఆలోచనకూడా కలిగింది: 'మందాకిని మాట విన్నాను. చెడ్డాను. నలుగుర నోళ్ళలో పడ్డాను. పోతే—ఆ కిరాతరాజు నాపట్ల అనుకూలంగా వున్నట్లే కనిపిస్తాడు. కాని, పని వచ్చేసరికి తప్పుకొని తటస్థంగా వుంటున్నాడు. అతని నటన అంతు పట్టకుండావుంది. ఉండడమేమిటి? అతనికి మనుమనిమీదనే మమకారం. వానిని విడిచి క్షణం నిలవలేడు. యిప్పుడు చూడగా-ఈ మందపాలునికి రాజ్యకాంక్ష పట్టుకొన్న సంగతి స్పష్టమైంది. తోడుగా వుండి, వీనికి భల్లాణరాజ్యం దఖలుపరిస్తే,




అన్నివిధాలా నాకు మేలయేటట్టు తోస్తుంది. పైగా, మందానికిమూలంగా వచ్చిన చెడ్డపేరు మాసిపోయి, ఎప్పటి గౌరవం ఏర్పడవచ్చు. అలా ఏర్పడిననాడు నా చాకచక్యానికి లోకమూ మెచ్చుకుంటుంది. పోతే, అటు ప్రమోదునిపైనా కిరాతరాజు మీదాకూడ ఇష్టంవచ్చినట్టూ పగ సాధింప వచ్చు. ఇన్ని పనులూ ఒక్కమారుగా నెరవేరటానికి ఇదే చక్కటి అదను. ఈ తరుణం పోనీయకూడదు' అంటూ యోచించి, 'నాయనా!–సరే, మన చేతిలో యేముంది? చేతనైన పని చేసిచూదాం లోపం లేకుండా...' అన్నాడు.

అటుతరువాత, మంతనాలు సల్పటాని కని వారుభయులూ రహస్యమందిరానికి వెళ్ళారు.

* * *

మృందాకిని పోయినప్పటికీ వంశం నిల బెట్టేందుకు అర్థకర్ముడైనా నిలిచివున్నాడు కదా అనే తృప్తితో, ప్రమోదుడు పసివానిని ఎంతో అభిమానంతో కనిపెట్టి, వేయి కళ్లలో చూచుకొంటూ వున్నాడు.

త్వరలోనే అర్ధకర్ముడికి పరిణయమూ, పట్టాభిషేకమూకూడా చేసి, కొంతలో కొంత మనశ్శాంతి పొందాడు.

మరికొద్దికాలానికే అర్ధకర్ముడికి కుమారుడు కలిగాడు. ఇందుకు రాజ్యంలో అందరూ మితిలేని ఆనందాన్ని పొందారు. శిశువుకు 'చిత్రభాను'దని పేరు పెట్టి, అల్లారుముద్దుగా పెంచుకొంటున్నారు. ఈ విధంగా కష్టాలు గట్టెక్కి, మంచిరోజులు వచ్చినైకదా అని సంతోషిస్తూవుండగా—

ఒకరోజున ప్రమోదుని ఆస్థానంలోకి ఒక రాయబారి వచ్చాడు.కూడా ఒక లేఖ తీసుకవచ్చాడు. అది సామంతరాజులలో ఒకడైన ఘూర్జరదేశపు రాజువద్దనుండి వచ్చిన లేఖ. ఆ లేఖలో—

'భల్లాణరాజ్యమందు 'రత్నకిరీటధారణ' అనువంశికంగా వస్తున్న ఆచారం. మేము-అనగా సామంతరాజ్యాలవారమంతా, తర తరాలనుండీ ఆ రత్నకిరీటధారులైన ప్రభు వులకే కైమోడ్పుచేసి కప్పములు కట్టు తున్నాము. ఈనాడు ఆ రత్నకిరీటం అదృశ్యమైంది. అర్థకర్ముడు కిరీటం లేని రాజు. పట్టం కట్టుకోని ప్రభువును మేము ఆమోదించలేము. ప్రభువునే ఆమోదించ నప్పుడు ఇక కప్పము కట్టేదెట్లా? ఇదే మా తీర్మానం'—అని వున్నది.



కొంచెం స్తిమితపడుతూవున్న ప్రమో దునికి ఈ లేఖ గొడ్డలిపెట్టు ఐంది. 'ప్రత్యు త్తరం వస్తుందిలే' అని చెప్పి, ఆ వచ్చిన రాయబారిని పంపించివేశాడు.

తరువాత, వియ్యంకుడైన కిరాతరాజుతో-

"మామా! మన భల్లాణరాజ్యానికి చెందిన సామంతరాజులు పరమసాధువులూ సదయహృదయులున్నూ. ఇంతకాలం నుండి లేని ఈ సంఘటన ఇప్పుడెందుకు కలిగిందిచెప్మా?' అని అంటూ,'యిప్పుడేం చేదాం మరి?' అని సలహా అడిగాడు.

అప్పుడు కిరాతరాజు బాగా యోచించి, 'మనం బదులు రాసి పంపటంకంటె, మనిషివెళ్లి మాటాడటమే మంచిది. ఇప్పుడు సామంతరాజులున్న పరిస్థితిలో ఏ సమ యాన ఎలావుంటుందో చెప్పలేము. కనుక, ఉద్యోగస్థులను పంపటానికా వీలు లేదు. పోతే-వెళ్ళే రాయబారి పూర్తిగా నమ్మ కస్థుడైవుండాలి. సామంతరాజులను మాట లతో దారికి తీసుకురాగల చతురుడై వుండాలి...' అని చెప్పి ఊరుకొన్నాడు.

ఈ సలహా బాగా నచ్చింది ప్రమోదునికి. 'మామా!—మన మందపాలుడు ఉండగా ఎవరినో వెతుక్కోవటమెందుకు? ఉండు...' అంటూ, వెంటనే కబురుచేసి మంద పాలుని రప్పించాడు ప్రమోదుడు.

పరిస్థితులన్నీ మందపాలునికి తెలియజెప్పి, తనకు వచ్చిన ఉత్తరంకూడా చూపించాడు. "నీవు వెళ్ళి సామంతరాజులతో నా మాటలుగా ఇలా చెప్పు: 'ముందు కప్పం కట్టి మరీ మాటాడవలిసింది. రత్నకిరీటధారణ కేవలమూ కుటుంబ విషయమే కాని, రాజకీయాలకి సంబంధించింది కాదు. ఈ నెపంమీద కప్పం కట్టకపోయినట్టయితే అవిధేయతగా పరిగణించవలసివస్తుంది' అంటూ, నయానా భయానా మనసుకు నాటేటట్టు చెప్పు, వాళ్లు కప్పం కట్టేటట్టు చేసి, వెంటనే తిరిగి రావలిసిం" దన్నాడు.

అంటూ, రాజముద్రిక గల తన ఉంగరాన్ని ఇచ్చాడు. యిచ్చి, యిలా చెప్పాడు: 'దారిలో అమడకు ఒకటిచొప్పున రాజవిడిదెలుంటై. ఈ ఉంగరం చూపిస్తేసరి, కావలసిన సదుపాయాలన్నీ జరుగుతై. ఏరాజ్యంలో ఏవోటుకైనా యథేచ్ఛగా పోవచ్చు' అని చెప్పి పంపాడు.

అప్పుడు కిరాతరాజు, కొడుకుతో 'నాయనా—విజయం చేసుకురా. ఈ విషయం పిట్టకైనా తెలియనీయకు, జాగర్త!' అంటూ, మెలకువలు చెప్పాడు.

రాత్రనక పగలనక మందపాలుడు ప్రయాణంచేస్తూ పోసాగాడు. ఒకొక్క విడిదిలో దిగి, విశ్రాంతి తీసుకుని, తను ఎక్కివచ్చిన గుర్రాన్ని యీ విడిదిలో వదిలివేయటం, అక్కడినుండి మళ్ళీ అతను మరొక గుర్రాన్ని తీసికొని వెళ్ళటం—ఇదీ ప్రయాణంచేసే పద్ధతి.

ఇలా మూడురోజులు ప్రయాణం చేసిచేసి, నాలుగోరోజు రాత్రి ఒక విడిదిలో దిగి, అలసట ఎక్కువ కావటంచేత నడుం వాల్చాడు. అప్పుడు అతని మనసులో పరుగులెట్టిన సమస్యలు అన్నీయిన్నీ కావు. ఈ ఆలోచనలతోనే అతను గాఢ నిద్రలో మునిగిపోయాడు. మునిగిపోయివుండగా:

సరీగా అర్ధరాత్రప్పుడు—[ఇంకా వుంది]



# న్యాయ కత్తెర

చాలా పూర్వకాలమందు కళింగదేశానికి 'న్యాయమిచ్చే దేశం' అని ఖ్యాతి వుండేది. దీనికి ముఖ్యకారణం అక్కడ న్యాయ విచారణకూ, న్యాయనిర్ణయానికీ ఒక వింత సాధనంగా వుండే 'న్యాయ కత్తెర.'

తరతరాలుగా, దీనిని ఆ రాజవంశంలో ఒక అమూల్యవస్తువుగా భావించుతూ వచ్చారు. ఆ కత్తెర చాలా చిత్రమైన పద్ధతిలో, ఏమీ పొరపాటు లేకుండా న్యాయ నిర్ణయం చేసేది.

ఆ న్యాయకత్తెరను రాజభవనముందు వేలాడతీసివుంచారు. వాది, ప్రతివాదులు ఏ న్యాయాధిపతిదగ్గరకూ తీర్పుకోసం వెళ్లనక్కరలేకుండా న్యాయ విచారణా, న్యాయనిర్ణయం అంతా ఆ కత్తెరవల్లనే జరుగుతూండేది.

వాది, ప్రతివాదులు ఆ న్యాయకత్తెర దగ్గరకు వచ్చేవాళ్లు. వాళ్ళకు యిష్టులైన మధ్యవర్తులూ, ఎవరి పక్షాన న్యాయం వున్నదో తెలుసుకోవాలని కుతూహలంతో వచ్చిన ప్రజలూ, చుట్టూ గుమిగూడేవారు.

ఫిర్యాది తనకు జరిగిన అన్యాయమంతా ఏకరుపెట్టి తన రెండుచేతుల్నీ ఆ కత్తెర మధ్య పెట్టేవాడు. అలాగే ముద్దాయి తను నిర్దోషినని సమర్థించుకొని, ఆ కత్తెరమధ్య తన రెండుచేతుల్నీ పెట్టేవాడు. ఆ యిద్దరిలో ఎవడు అబద్ధంచెబుతున్నాడో వాడి చేతుల్ని ఆ కత్తెర ఖండించివేసేది.

ఒకమారు పాపం, పరప్రసాదంగా ఆ రాజులకు లభించిన న్యాయకత్తెరకూడా, న్యాయనిర్ణయం చేయ సాధ్యంకాని గడు సమస్య ఒకటి ఎదురైంది. యిలాంటి సమస్య వస్తుందని ఎవరూ ఎన్నడూ కలలోనైనా వూహించిఉండరు.

ఇరుగు పొరుగు వర్తకులు ఇద్దరిమధ్య ఒక పేచీ వచ్చింది. మొదటి వర్తకుడు

సి. పద్మరాజు - కాకినాడ




''నేను దూరదేశం వెళ్తూ యితడి దగ్గిర నూరు నవర్సుల బంగారం దాయమని ఇచ్చాను. తిరిగివచ్చి నా బంగారం అడిగితే లేదంట. ఏం న్యాయం?'' అని అడిగాడు.

అందుకు రెండోవర్తకుడు సమాధానంగా ''యితగాడు దూరదేశం వెళ్ళాడో లేదో నాకు తెలీదు. నూరు నవర్సుల బంగారం వున్నదో లేదోకూడా నాకు తెలీదు. కాని, ఒకటిమాత్రం ప్రమాణంచేసి మరీ చెప్తున్నాను. యితడు నాకు దాయమని నూరు నవర్సుల బంగారం యివ్వలేదు సరిగదా; ఒక్కమాటూ చూపనైనా చూపలేదు'' అంటూ సంజాయిషీ చెప్పాడు.

సరే, ఈ యిద్దరిలో ఎవరు నిజం చెప్తున్నారో, ఎవరు అబద్ధం చెప్తున్నారో ఎలా నిర్ణయించడం? ఇద్దరూ దేవుళ్ళమీదా, దేవతలమీదా ఒట్లువేసుకుని ప్రమాణాలు చేస్తూనే వున్నారు.

పదిమంది పెద్దలూ సమావేశమయ్యారు. నాలుగు రోజులు గడువుపెట్టి, యీ లోపల గనక రాజీ పడకపోతే 'న్యాయకత్తెర' నిర్ణయానికి వెళ్ళవలసి వుంటుందన్నారు.

'నాదగ్గిర నూరు నవర్సుల బంగారం దాయలేదని బొంకుతున్నాడు. ఆ వర్తకుడు నిజంగా దోషి. బంగారం దాస్తానని పుచ్చుకున్న మాటా, దాన్ని గుటకాయస్వాహా చేయాలని అతడికి దుర్బుద్ధి పుట్టినమాటా నిజం' అని మొదటివర్తకుడు గోలపెట్టనారంభించాడు.

ఐతే న్యాయకత్తెర నిర్ణయం ఎలా వుంటుందో రెండవ వర్తకునికి తెలియందికాదు. అబద్ధీకులకూ, అన్యాయ వర్తనులకూ చేతులు ఇట్టే ఖండించుకొనిపోవటం అతనికళ్లతో అతను లోగడ చూసేవున్నాడు. అందుచేత ఆ గండం గడిచి బయటపడేందుకు, ముందే ఒక చక్కని వుపాయం ఆలోచించాడు.

ఏమీ ఎరగనట్టు, పెద్దమనిషిలాగా చేతి కఱ్ఱ వూపుకొంటూ అతను వాయిదారోజున న్యాయకత్తెరదగ్గరకు వచ్చాడు.

మధ్యవర్తులూ, ఏపక్షాన తీర్పు జరుగుతుందో చూద్దామని వచ్చిన ప్రజలూ రాజభవనంముందు చేరారు. న్యాయకత్తెర యథాస్థానంలో వేలాడుతోంది.

నూరు నవర్సుల బంగారం పోగొట్టుకున్న మొదటి వర్తకుడు ఆ కత్తెరమధ్య తన చేతులుంచి ప్రమాణంచేసి తనకు జరిగిన అన్యాయాన్నీ, నమ్మకద్రోహాన్నీ కళ్ళనీళ్లతో వివరించాడు. మధ్యవర్తులూ, చుట్టూ చేరిన ప్రజలూ కత్తెరకేసి చూస్తూనే వున్నారు. కాని కత్తెర కదలకుండా అలానే వుండిపోయింది.

అతరువాత, నూరు నవర్సులూ కాజేసినాడనుకొన్న రెండవ వర్తకుని వంతు వచ్చింది. అతను న్యాయకత్తెర దగ్గరకు నిర్భయంగా వచ్చి, తన చేతికఱ్ఱను పక్కనే నిలబడివున్న మొదటి వర్తకునికే పట్టుకోమని యిచ్చి, చేతుల్ని కత్తెరమధ్యపెట్టి ప్రమాణంచేసి :

"నేను ఎవరి బంగారమూ అపహరించలేదు. నేను అపహరించానని నేరం మోపు



తూన్న యీ వర్తకుని నూరు నవర్సులూ అతనిదగ్గిరే ఉన్నాయేమో!" అన్నాడు.

మధ్యవర్తులూ, గుమిగూడిన ప్రజలూ కళ్లార్పకుండా కత్తెరకేసి చూస్తునేవున్నారు. ఒక్కదెబ్బతో ఆ వర్తకుని చేతులు కత్తిరించుకుపోతవని వాళ్ల అభిప్రాయం. పైగా, మొదటివర్తకుని చేతులు ఖండింపబడలేదు గనుక, ఈ రెండవవాడే నేరస్థుడై వుంటాడని అందరూ భావించారు.

కాని అశ్చర్యం!—ఆ న్యాయకత్తెర కదలామెదలక అలా వేలాడుతూనే వుండిపోయింది. ఐతే మరి, ఇద్దరిలోనూ ఎవరు దోషులైనట్టు? ఎవరు నిర్ణయించేది?

ఆ దేశంలో ఇది ఏనాడూ జరిగివుండని వింతసంఘటన. ప్రజలంతా విస్తుపోయి చూస్తున్నారు. మధ్యవర్తులు ఏమీతోచక తలలుపట్టుకున్నారు. న్యాయనిర్ణయం చేయటంలో ఎన్నడూ ఏమాత్రమూ తటపటాయించని ఆ కత్తెర నిలకడగా అలా వుండిపోయిందే !!

ఉన్నట్టుండి పెద్దమనుషుల్లో ఒకరికి కనువిప్పు కలిగింది. ఇందులోని అసలు కీలకం ఆయన గ్రహించాడు. దోషిఐన వర్తకుడు నమ్మకంగా వేసిన మడతపేచీని ఛేదించేటందుకు న్యాయకత్తెరకుకూడా సాధ్యంకాలేదని తేలిపోయింది.

ఆ మోసకారి వర్తకుడు వక్రమార్గాన విజయం సాధించాడు. ఈ తెలివికి అతనికి పట్టపగ్గాలు లేకుండాపోయినై. తను ప్రమాణంచేసి న్యాయకత్తెరమధ్యని చేతులు వుంచేటప్పుడు, పట్టుకోమని ఇచ్చిన తన చేతికర్రను మళ్ళీ ఆ వర్తకునిదగ్గర నుంచి తీసుకుని అతడు ఇంటికి పోదామని బయలుదేరాడు.

నాలుగడుగులు వేశాడోలేదో, వెనకనుంచి కేక వినబడింది. ఇందాకటి ఆ పెద్దమనిషి వర్తకుని చేతికర్రను లాక్కుని, పళక్కున మధ్యకు విరిచాడు.

ఆ చేతికర్రనుంచి నూరు నవర్సులూ జలజలమని రాలటం లక్షలాది ప్రజల కంటబడింది. ఇది అందరకూ చెప్పలేని ఆశ్చర్యం కలిగించింది.

అప్పుడు పెద్దలు నలుగురూ చేరి నూరు నవర్సులనూ మొదటివర్తకుడికిఇప్పించారు. రెండో వర్తకుణ్ణి శిక్షించారు. ఐతే, న్యాయనిర్ణయంలో అపజయం పొంది, పట్టు తప్పిపోయిన ఆ న్యాయకత్తెరను స్థానం తప్పించి, రాజభవనంలోని పాతసామాన్ల కొట్లో పారవేయించారు.

నాటినుంచీ రాజ్యంలోని న్యాయాధిపతులకు చేతినిండా పని కలిగింది.






అనగనగా ఒక రాజు. తక్కిన రాజు లందరిలాగా కాక, ఆయన పరిపాలనలో ఒక విశేషమున్నది. అది యేమిటీ అంటే: మారువేషంతో తిరిగి, ప్రజల స్థితిగతులు స్వయంగా తెలుసుకోవటం ఆయనకు సరదా. అందుకనే, మంత్రిని వెంటబెట్టుకుని, వూరూరా సంచారంచేస్తూ వుండేవాడు.

ఒకప్పుడు వారిద్దరూ పోయిపోయి, మిట్ట మధ్యాహ్న మయేసరికల్లా దూరాన వుండే ఒక గ్రామం చేరుకొన్నారు. ఆ గ్రామంలో ఒక యింటిముందు వారికి ఒకాయన కనిపించాడు.

ఆయన నిమ్మపండువంటి చాయ గలవాడు, ఇరవయ్యేళ్ల ప్రాయంవాడు, వయసుకు తగ్గ ఒడ్డూ పొడవూ గలవాడు, మంచి స్ఫురద్రూపి.

భూతబలి వేయటానికని ఆయన అప్పుడే యివతలికి వచ్చి నిలబడ్డాడు. రాజూ మంత్రీ వెళ్లి ఆయనను పలకరించి, పుట్టుపూర్వోత్తరాలన్నీ కనుక్కున్నారు.

ఆ వ్యక్తి తనపేరు 'మిహిరు'డని చెబుతూ, వారికి ఆతిథ్యమిచ్చాడు. వారు ఇష్టాగోష్ఠి చేస్తూవుండగా, ప్రస్తావవశాత్తు, మిహిరుడు గొప్ప జ్యోతిష్కుడనే విషయం రాజుకు వెల్లడయింది.

ఆ గొప్పదనం ఏమిటో పరీక్షిద్దామని చెప్పి, రాజు 'స్వామీ! మేము వర్తకులం. వ్యాపారవిషయంలో దేశసంచారం బయల్దేరాము. మేం తలపెట్టిన వర్తకం లాభిస్తుందా, లేదా? ప్రారంభించటానికి ఎప్పుడు బాగా వుంటుంది? సెలవియ్యండి' అని కోరాడు.

వెంటనే మిహిరుడు 'అయ్యా, మీరిద్దరూ జాతివర్తకులు కారు. మారువేషంలో ఉన్న క్షత్రియులు. మీరు 'ఫలానా'వారై వుంటారనటానికి సందేహమేమీ లేదు' అని చెప్పే

యస్. పురుషోత్తం - తాడిపత్రి



సరికి వారు ఆమితాశ్చర్యం పొందారు. తరువాత రాజు, మిహిరుని తమ ఆస్థానంలో పెట్టుకొన్నాడు.

ఇలావుండగా—లేకలేక చాలా కాలానికి, రాజుకు ఒక కుమారుడు కలిగాడు. శిశువు జాతకం తయారుచేయవలిసిందని ఆస్థాన జ్యోతిష్కులందరికీ రాజాజ్ఞ అయింది. ఆ గొప్ప గొప్ప జ్యోతిష్కులందరూ శాస్త్రాలు తిరగవేసి, తమ యావచ్ఛక్తినీ జ్ఞానాన్నీ వినియోగించి, అతిశ్రద్ధతో రాజకుమారుని జాతకం సిద్ధపరిచారు.

పని పూర్తి ఐందనగానే, రాజు దర్బారు చేశాడు. ఆ సభలో అందరూకూడా 'రాజ కుమారుని జాతకం చాలాదివ్యంగా వున్నది. ఐతే ఇరవయ్యోఏటమాత్రం అందులో ఒక చిన్న గండం కనిపిస్తున్నది కాని, అది యేపాటి?—ఇట్టె దాటెయ్యవచ్చు'నంటూ ఏకగ్రీవంగా చెప్పారు.

అందరూ కలిసి ఈవిధంగా చెబితే, మిహిరుడు మాత్రం 'ఆ బాలుడు ఇరవైయ్యో ఏట ఫలానారోజున అయిదున్నర గంటలకు అడవిపందిమూలంగా తప్పక మరణిస్తాడు' అని జంకుగొంకులులేకుండా చెప్పాడు.

రాజపుత్రునికి బాల్యం దాటింది. జ్యోతిష్కులమాటలు జ్ఞాపకం రాగా, అప్పటినుండి రాజుమనస్సు కలవరపడజొచ్చింది.

అటు సూర్యుడు ఇటు పొడిచినప్పటికీ మిహిరుని నోటివాక్యానికి తిరుగులేదని రాజుకు బాగా తెలుసు. కనుక, కుమారుని విషయంలో ఉపేక్షచేయటానికి ఎంతమాత్రమూ వీలులేదనుకొన్నాడు.

పోతే—దైవవిధికి అడ్డుపెట్టేశక్తి ఎంతమాత్రమూ మానవునికి లేదు. ఐనా, ప్రయత్నంచేసి కుమారునకు అడవిపందిమూలంగా వచ్చే గండం తప్పింప చూదామని రాజుకు బుద్ధిపుట్టింది.

ఈ ఉద్దేశంతో నగరానికి దూరాన ఏడంతస్థుల మేడ కట్టించి, చుట్టూ ఎత్తయిన గోడలు ఆవరణగా పెట్టించి, చీమలు చొరటానికైనా వీలుకానంత బందోబస్తు చేయించాడు.

సమస్త సదుపాయాలూ ఆ మేడలోనే జరగటానికి యేర్పాటుచేసి, సహపాఠులతోసహా తన కుమారుణ్ణి దానిలో ప్రవేశపెట్టించాడు. బాలురు ఎవళ్ళూ మేడ విడిచి చుట్టుపక్కల వనాలలోకి విహారం వెళ్ళకుండా కట్టడి చేశాడు. ఇన్ని చేసి, తను అప్పుడప్పుడు వచ్చిపోతూ చూస్తూ వుండేవాడు.

ఇలా వుండగా—గండకాలం సమీపించింది. జ్యోతిష్కులు పెట్టిన గడువు ఇక ఒకటి రెండు రోజులే వున్నది. అప్పుడు రాజు సైనికులతో ఇదివరకుకంటెకూడా చాలా జాగర్తగా వుండండని హెచ్చరిక చేశాడు. గండ దినమునాడు సూర్యోదయం మొదలు ప్రతిక్షణమూ కుమారుని ఆరోగ్యం తనకు తెలుపటానికని రాజు వేగరులను ఏర్పాటుచేశాడు.

మధ్యాహ్నం మూడు గంటలయ్యే వరకూ వేగరులు ఒకరి వెనుక ఒకరు




వచ్చి, రాజపుత్రుడు ఉత్సాహంగానే ఉన్నాడని చెబుతూవచ్చారు. రాజు కొలువుతీర్చి పండితగోష్ఠి జరుపుతున్నాడు.

సభలోవారు అందరూ, మిహిరుడు లెక్కలు వేయడంలో ఏమాత్రమో పొరపడి వుంటాడనీ, ఆయన మాట పొల్లు అయితే రాజుకు ఆగ్రహం కలుగుతుందనీ భయపడసాగారు. ఇంతలో ఐదుగంటలైంది. సభలో వారందరితోసహా కుమారుని చూడటానికని బయల్దేరాడు రాజు.

దారిలో ఒక బంటు యెదురై, కుమారుడు బాగానే ఉన్నాడనీ, చక్కగా ఆడుకుంటున్నాడనీ రాజుతో చెప్పాడు. ఇదేమి

టన్నట్టు అందరూ ఒక్కసారిగా మిహి రునివంక చూశారు.

అంతమాత్రానికే మిహిరుడు బెదరలేదు. 'నాజోస్యం తప్పదు' అన్నాడు. అప్పుడు రాజు కుమారుడు వుండే నగరు ప్రవేశించి, భోగట్టాచేయగా, బాలుడు నాలుగో అంతస్థు మీద వున్నాడని సేవకులు చెప్పారు. అక్కడికి పోయి చూస్తే, అరగంటకింద టనే గాలికోసం డాబామీదికి వెళ్లాడన్నారు.

మిహిరునివంక చూచాడు రాజు. అందుకు మిహిరుడు "బాలుడు ఈ లోకం వదలి అప్పుడే అరగంటసేపయింది" అని నొక్కి చెప్పాడు.

దడదడ కొట్టుకొంటున్న గుండెలతో అందరూ యేడవఅంతస్థు ఎక్కుతున్నారు. ఇంత యెత్తుకు అడవిపంది యెలా యెక్క గలుగుతుందా అనిఅందరికీ సందేహం పట్టుకున్నది.

తీరా డాబా యెక్కి చూచేసరికి, ఒక జెండా స్తంభంకింద, మంచంపైన—రొమ్ము మీద భారమైన ఇనుప వరాహవిగ్రహం పడి నెత్తురులోడుతున్న శరీరంతో,రాకొమారుడు కనిపించాడు! పుత్రశోకం భరించలేక అపరి మితంగా విలపించాడు రాజు.

'ఈ నగరు నిర్మించినప్పుడు శిల్పి ఈ విగ్రహాన్ని జెండా స్తంభంమీద నిలిపి వుంటాడు. కుతూహలంకొద్దీ బిడ్డడు దీనిని లాగివుంటాడు. దానిఫలితమే యిది. వరాహ మూర్తి మా యిలువేలుపు అయివున్నాడు. మా కులదైవమే ఈవిధంగా నా బిడ్డడిని తనలో ఐక్యం చేసుకొన్నాడు. యేది యేమన్నా, శాస్త్రం తప్పదు!" అని అంద రికీ తరువాత రాజు తెలియజెప్పాడు.

రాజు అప్పుడు మిహిరుని కౌగిలించుకొని, ఎంతగానో గౌరవించి, 'వరాహమిహిరు' డనే బిరుదు ప్రసాదించాడు.






పూర్వం తాళ్లచెరువు అనే గ్రామంలో తిమ్మయ్య అనే పేరుగలవాడు ఉండేవాడు. అతడికి పెళ్లీ పెటాకులూ ఏమీలేదు. పైగా వర్తి తాగుబోతు.

వేళకు యింత కూడూ కుమ్మూ కావాలనే సంగతే ఆలోచించేవాడు కాదు, తిమ్మయ్య. ఏదో ఆకలైనప్పుడు ఎక్కడో ఒకచోటున ఎలానో అలాగ ఆ కాస్తా పనీ పూర్తిచేసుకునేవాడు.

పోతే, ముప్పొద్దులా అతడికి ఒకటే యావ. కల్లు తాగేందుకు ఏ తాటితోపులో కన్నా వెళ్లడం ఎలాగా? అని.

వయసు వచ్చినప్పటినుంచీ తిమ్మయ్య జీవితం యిలాగే సాగుతోంది. చీకటి పడీ పడటమే తడవుగా, ఎవరూ చూడకుండా చల్లగా ఏ తాడిచెట్టో ఎక్కి నిండుగా వున్న కల్లుముంత దింపుకొని ఎక్కడికో మారుమూల చోటుకు వుడాయించేవాడు. తెల్లవార్లూ తాగి, అక్కడే అటూ యిటూ పడి దొర్లి, తూలుతూ పొద్దున్నే మళ్లీ గ్రామంలోకి వచ్చి మొహంచూపేవాడు.

ఒకరోజున పాపం, బలే చిక్కులో పడిపోయాడు తిమ్మయ్య. చీకటిపడగానే ఒక తాడిచెట్టు ఎక్కి కల్లుముంత తీసుకుని దిగే సమయానికి, ఆ చెట్టు యజమాని కర్ర పుచ్చుకుని వెంటపడ్డాడు. బతుకు జీవుడా అనుకుని తిమ్మయ్య ఆ చీకట్లో కాలికొద్దీ పరుగుచ్చుకొన్నాడు.

ఆ హడావిడిలో తను ఎక్కడికి పరిగెత్తుతున్నదీ గమనించనేలేదు తిమ్మయ్య. పైగా కటిక చీకటి. రొప్పుతూ రోజుతూ యిక పరిగెత్తలేక వున్నచోటునే కూలబడిపోయి, చుట్టూ చూశాడు. అతడి గుండె ఆగిపోయేటంత పని జరిగింది. తను సరాసరి పాడుపడిన పరిశపాడు శిథిలాల్లోకి వచ్చేశానని తెలుసుకున్నాడు.

డి. సుబ్రహ్మణ్యం - రేపల్లె



పరిశపాడు శిథిలాల పేరు చెబితే చాలు, చుట్టుపట్ల కొన్ని ఆమడల దూరంలో వుండే గ్రామస్థులందరికీ గుండె బితుకుబితుకు మంటూవుంటుంది.

కొన్ని వందల సంవత్సరాలనాడు పాడు పడిన ఆ గ్రామపు శిథిలాల్లో పట్టపగలే దయ్యాలూ, భూతాలూ కుస్తీపట్లు పడుతూంటవని వాళ్ళందరికీ నమ్మకం. అందు చేత పగటిపూటైనా ఎవ్వరూ అటు వెళ్లరు.

ఇక రాత్రిపూట పొరపాటున తెలియని వాళ్ళు ఎవరైనా అటు వెళ్లారా, తెల్లవారి వళ్ళంతా హూనంహూనం అయి, లబొదిబో మంటూ బయటపడాల్సిందే!

పాపం, తాగుబోతు తిమ్మయ్య వళ్ళూపై తెలియని హడావిడిలో, చీకట్లో అలాంటి చోటుకు రానేవచ్చాడు. ఇప్పుడేం చేయాలి? అతడు గుండె దిటవుపరుచుకుని చుట్టూ కలయజూశాడు. ఏ భూతాలూ కనబడలేదు.

పక్కన కనబడిన కల్లుముంత చేతికి తీసుకుని, 'కాస్త తాగితే ధైర్యంవస్తుంది. ఆ తరవాత ఇక్కడినుంచి బయటపడ వచ్చు' అనుకున్నాడు.

ఇక తాగడం ప్రారంభించాడు. సగం ముంత ఖాళీ అయేసరికి, తను ఎవరూ అన్నసంగతీ, ఎక్కడ వున్న సంగతీకూడా మరిచిపోయాడు.

పూర్తిగా వానికి తిక్క ఎక్కింది. ఇదంతా సగంపడిన మొండిగోడ చాటున వుండి చూస్తున్న పరిశపాడు పెద్దచయనుల భూతం 'భలే సమయం' అనుకుంటూ తిమ్మయ్య ముందుకు వచ్చి నిలబడింది.

తిమ్మయ్య బాగా ఎక్కిన కైపులో మై మరిచివున్నాడేమో—

"ఎవరివయ్యా నువ్వు? హ్హాఁ!" అన్నాడు గద్దిస్తూ. భూతం నవ్వుకుంది.

"నేనా...పరిశపాడు పెద్దచయనుల్ని! నాతో కుస్తీపడ్తావా?" అన్నది చయనుల



భూతం. ఆ మాటలతో తిమ్మయ్యకు రోషం వచ్చి భూతంకేసి మిర్రిచూశాడు. కాని భూతం భూతంగా లేదు.

పండితశాల్వా కప్పుకొని, కాళ్ళకు పావుకోళ్లు తొడుక్కొని, చెవులకు కుండలాలు పెట్టుకుని, చేతులు రెండింటికీ సింహతలాటంమురుగులు అలంకరించుకొని,— అచ్చగా పండిత బ్రాహ్మడిలా వుంది ఆ భూతం.

"కుస్తీ! హ్హా! రా!" అంటూ లేచాడు తిమ్మయ్య: ఏదో ముసలిబ్రాహ్మడు, ఒకసారి గూబ గుయ్యమనిపిస్తే సరిపోతుందని.

కాని, పెద్దచయనుల భూతం కుస్తీపట్లలో ఆరితేరిన ఘటం. కొన్ని వందల సంవత్సరాలనుంచి, వీలు కలిగినప్పుడల్లా ఎవరినో ఒకరిని యిలాగే సవాలుచేసి బొమికల్లోకి సున్నంలేకుండా కొట్టూవున్నది.

తిమ్మయ్య కలియబడ్డాడు. మరుక్షణంలోనే చయనులభూతం అతణ్ణి రెండు చేతులతో పైకెత్తి విసురుగా నేలకు కొట్టింది. దెబ్బతో తల దిమ్మెత్తి, తాగింది కాస్తా దిగిపోయింది తిమ్మయ్యకు. మరుక్షణంలోనే తను పరిశపాడు శిథిలాలలో వున్నాననే సంగతి గుర్తుతెచ్చుకున్నాడు. ఈ సంగతి జ్ఞాపకానికి వచ్చేసరికల్లా వళ్ళు జలదరించింది.

"బాబో, నన్ను వదులు! యిక బ్రతికుండగా యిటు రాను!" అంటూ ప్రాథేయపడసాగాడు తిమ్మయ్య.

"ముందు కుస్తీ పడతానన్నావుగదా! అదేదో కానీవోయ్ తిమ్మయ్యా!" అంటూ చయనులభూతం అతడి రొమ్ముమీద కూర్చుని గొంతు పిసుకసాగింది.

తిమ్మయ్యకు ముచ్చెమటలూ పోసినై. యిక ఎలాఅయినా చచ్చిపోతున్నానుగదా అని తెగించాడు. ఆ తెగింపుతో భూతం తల గట్టిగా చేతుల్తో పట్టుకుని కిందకు లాగాడు.




చయనులభూతానికి సన్నగా చిటికెన వేలంత లావున ఒక పిలక వుంది. తిమ్మయ్య దానితల పట్టుకోగానే విడిపించుకునేందుకు అటూ యిటూ పెనగులాడటంలో ఆ పిలక కాస్తా తిమ్మయ్యగుప్పెట్లోకి కుదుళ్లతోకూడా వూడి చక్కావచ్చింది.

"చచ్చానే నాయనా!" అని అరుస్తూ చయనులభూతం, తిమ్మయ్యను వదిలి లేచి నిలబడింది. 'బతికాన్రా బాబూ' అనుకొంటూ తిమ్మయ్యా లేచినిలబడ్డాడు. వూడివచ్చేసిన భూతంపిలక యింకా తిమ్మయ్య వేళ్ళసందునే వుంది.

"తిమ్మయ్యా! నా పిలక నాకిచ్చెయ్యి. నిన్నేమీ చేయను" అంది భూతం. తిమ్మయ్యకు ఆ మాటల్తో ఎక్కడలేని ధైర్యం కలిగింది. "ఊహుఁ! యివ్వను, నీ పుటం అరుస్తా చూడు!" అంటూ పరవళ్లు తీశాడు తిమ్మయ్య. చయనుల భూతం ఏడుస్తూ మళ్ళీ యిలా అన్నది:

"తిమ్మయ్యా! ఆ పిలక నీకెందుకూ పనికిరాదు. అది లేకుండా నేను తక్కిన భూతాలదగ్గిరకు వెళ్ళానంటే—అవన్నీ నన్ను కాకిని పొడిచినట్టు పొడుస్తయ్! పైగా నా బలమంతా అందులోనే వుంది."

"అహాఁ! అదా కథ! యిందాకటినుంచీ అమాట చెప్పావే కాదూ?" అంటూ తిమ్మయ్య ఎగిరి గంతేసి భూతంభుజాల మీదికిఎక్కి కూర్చున్నాడు.

పిలక కాస్తా తాగుబోతు తిమ్మయ్యచేతిలోకి వూడిరావడంతో శక్తిఅంతా వుడిగిపోయిన భూతం, ఇక తిమ్మయ్యని ఏమీచేయలేక ఏడుస్తూ కాళ్ళావేళ్ళా పడసాగింది.

"భుజంమీదినించి దిగి, నా పిలక నాకు ఇచ్చేశావంటే, నీకు ఈ పాడుపడిన శిథిలాల్లోంచి ఒక లంకెబిందె తెచ్చియిస్తాను. బిందెనిండా మొహరీలూ, సొరీలూను. నీ



దరిద్రమంతా తీరిపోతుంది!" అంటూ ఆశ పెట్టి, మళ్ళీ బతిమాలింది భూతం.

ఆ మాటలు వినగానే తాగుబోతు తిమ్మయ్యకు ఎక్కడలేని ఆశా కలిగింది. యీదెబ్బతో మనం చుట్టుపట్లగ్రామాలన్నిటికి పెద్ద జమీందారే ఐపోవచ్చుకదా అనుకున్నాడు.

"సరే, ముందు ఆ లంకెణిబిందె ఏదో తీసుకురా! తరవాత నీ పిలక ఇచ్చెయ్యటం మాట ఆలోచిద్దాం" అన్నాడు తిమ్మయ్య. తీరా నమ్మి, చేతిలో పిలక కాస్తాఇచ్చేస్తే, తిరిగి భూతం పుంజుకుని తన గొంతు పిసికేస్తుందేమో అనే ముందుఆలోచనతో ఇలా అన్నాడు. ఏమీ అంటే, ఈ మోసకారి భూతాల స్వభావం తిమ్మయ్యకు ఇంతకు ముందే బాగా అనుభవం వున్నది.

చడీచప్పుడులేకుండా చయనులభూతం ఆ శిథిలాల్లోకి వెళ్లి తళతళమెరుస్తూన్న ఒక పెద్ద యిత్తడిబిందె తెచ్చింది. దాని మూత తీసిచూస్తే ధగధగమెరుస్తూ అన్నీ బంగారు నాణాలే !!

"ఇక నా పిలక నాకిచ్చెయ్ మరి!" అన్నది చయనులభూతం. తిమ్మయ్య కాసేపు ఆలోచించి—

"అలా కుదరదు. పిలక కాస్తా యిచ్చేసిన తరవాత నాగొంతుపట్టుకు పిసికేస్తే నేనేం చేసేది? భూతాల్ని నమ్మగూడదంటారు పెద్దలు. కనక, యీ లంకెణిబిందెను సరాసరి నాయింటికి చేరవేసెయ్యి. తరవాత నీపిలక నీకు యిచ్చేస్తాను" అన్నాడు.

పాపం, చయనులభూతానికి అడకత్తెరలో యిరుక్కున్నట్టయింది. తన కర్మానికి ఏడుస్తూ, లంకెణీబిందె ఎత్తుకుని తాగుబోతు తిమ్మయ్యవెనకే అతని గ్రామానికి బయలుదేరింది.

తిమ్మయ్య వుండే పూరిపాక ఆ గ్రామానికి ఒక పక్కగా వుంటుంది. చీకటి మరుగున

ఎవరూ చూడకుండానే యింటికి చేరాడు. భూతం భుజాన్నుంచి లంకెణీబిందె దించుకుని యింట్లో భద్రపరుచుకున్నాడు. తరవాత అతడికి ఒక తమాషాచేయాలని బుద్ధి పుట్టింది :

భూతానికి తెల్లవార్లూ పిలక ఇవ్వకుండా వుంటే— ఎక్కడికీ పోకుండా వాకిట్లోనే పడివుంటుంది. తెల్లవారి గ్రామస్థులందరికీ తన సాహసకృత్యం ప్రదర్శించి భూతాన్ని కూడా వేడుకగా చూపెట్టవొచ్చు అని.

"యిక వెళ్తా, నాపిలక యిచ్చేసెయ్!" అన్నది భూతం.

తిమ్మయ్య ఆలోచిస్తూనే భూతంకేసి చూశాడు. కాళ్ళకి పావుకోళ్ళు, పైన పండితశాల్వా, చెవులకు మెరుస్తూన్న కుండలాలూ—అంతా ఒక పండితుడిలాగా కనబడింది.

యిలాంటి రూపంలో వున్న భూతాన్ని చూసి గ్రామస్థులు నిజంగా పండితుడే అనుకుంటే, తనకు తన్నులు తగుల్తాయనీ, పైగా లంకెణిబిందె సంగతి బయటపడితే తనకే ప్రమాదమనీ దూరం అలోచించాడు తిమ్మయ్య.

అప్పుడు తలుపు ఓరగా వేసి సందులోనుంచి పిలక బయటికి గిరాటువేసి, "యికపో! ఇక్కణ్నుంచి!" అంటూ తలుపు లోపల గడివేసేసుకున్నాడు తిమ్మయ్య.

అప్పుడు అచయనుల భూతం తన పిలక తీసుకుని "బతికిపొయ్యావు లే తిమ్మయ్యా. కానీ, ఎన్నడైనా మళ్లీ పరిశపాడు ప్రాంతాల్లో కనబడ్డావో, జాగర్త...!" అంటూ హుంకరించి వెళ్ళిపోయింది.

లంకెణీబిందెల్లో వున్న మొహరీలూ, సారీలూ కరిగించి బంగారంగా అమ్మేసి, కొద్దికాలంలోనే తాగుబోతు తిమ్మయ్య సాహుకారు తిమ్మయ్యగా మారి, కోట్లకు పడగలెత్తాడు. ఏమైనప్పటికీ, అతడు మరెన్నడూ పరిశపాడు వైపుమాత్రంపోలేదు.






బాబూలాల్ అప్పుడే వూరినుండి వచ్చి, బండి దిగాడు. దిగి, తన షాపులోకి వెళదామని లోపలికి పోయాడు. కాని, వెళ్లటానికి వీలులేదని పోలీసులు అటకాయించారు.

బాబూలాల్‌ను అటకాయించట మనేది సామాన్యవిషయమా?—అతడు గొప్ప సావుకారు. అతనిది పేరుపొందిన షాపు. ఊళ్ళో విద్యార్థుల దగ్గరనించీ పెద్దఉద్యోగస్థుల వరకూ అతనిషాపులోనే సామానులు తీస్తారు. బాబూలాల్ అంటే అంత ఘరానా, అంత నమ్మకమున్ను.

ఇలా తన షాపులోకి తననే వెళ్ళనీయక పోవటం, ద్వారంవద్ద పోలీసులు బందోబస్తుగా వుండటం, చుట్టూ అనేకమంది జనం మూగివుండటం—ఇదంతా చూడగా అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

అంతలో బాబూలాల్ కొడుకు 'మా నాయన సార్! మా నాయన వచ్చార్ సార్!!' అంటూ, సబినస్పెక్టరును వెంటబెట్టుకొని గుమ్మంవద్దకు వచ్చాడు. ఇన్స్పెక్టర్ చెప్పగా, పోలీసులు బాబూలాల్‌ను లోపలకు వదిలారు.

అప్పుడు షాపులోపల విచారణ జరిగింది. ఎవరికి తెలిసిన విషయాలు వాళ్లు పూసగుచ్చినట్టు అధికారికి సంజాయిషీలు చెప్పకొన్నారు. వాళ్లువాళ్లు చెప్పిన వాఙ్మూలాలన్నీ పోలీసు కట్టలుకట్టలుగా కాగితాలపైన రాసుకొన్నాడు.

షాపు యజమాని ఐన బాబూలాల్ ఊరు వదిలివెళ్ళి పదిరోజులకుపైన అవుతుంది. ఇక్కడ బండి దిగినతరవాత ఏమి చూచాడో అది తప్ప, అతనికి మరేమీ తెలియదు. ఈ మాటలే చెప్పాడు. వ్రాతమూలకంగాకూడా వాఙ్మూలం ఇచ్చాడు.

తరువాత బాబూలాల్ కొడుకు తను ఎరిగిన విషయాలు ఇలా చెప్పాడు:

సి. రఘునాథరాజు - విశాఖపట్నం




'తెల్లవారివచ్చి చూస్తే, తలుపులూ తాళాలూ ఎక్కడివక్కడనే వున్నయి. షాపులో నిన్నరాత్రి అంగడి మూసేటప్పటికి వుండే సామాను ఉదయానికల్లా మాయమయింది' అని లెక్కలతోసహా వివరాలతో సహా విప్పిచెప్పాడు.

పైగా, పట్టీలు దాఖలాచూచి, పోయిన సామానులు కచ్చితంగా జాబితా తయారు చేసి యిచ్చాడు.

అసలిప్పుడు నడుస్తున్న కేసు ఇదే. అనగా, బాబూలాల్ షాపులో అకస్మికంగా చోరీ జరగటం, చోరీజరిగిన చిన్నెలు ఏమీ కనపడకపోవటమున్నూ.

కాపలా కాసే ఘూర్ఖావాడిని అనుమానించి కైదుచెయ్యమన్నాడు అధికారి. అలానే చేశారు. 'నా కేపాపం తెలియ'దని మొరపెట్టుకొన్నాడు ఘూర్ఖావాడు. అయినా పోలీసులు వదలలేదు.

అక్కడినుండి బాబూలాల్ సామగ్రి వుండే గొడాములవద్దకు పోయి పరీక్షచేదామని సిద్ధంచేసుకొంటున్నారు పోలీసులు.

పోలీసువారి పని మరేమీలేదుకదా అని బాబూలాల్ అధికారి అనుజ్ఞపైన మామూలుగా తన స్థానంలో కూర్చున్నాడు. వ్యాపారం యథాప్రకారం సాగిపోతున్నది.

ఇంతలో-ఒక దర్జాపురుషుడు లోపలికి వచ్చి, నవ్వుతో బాబూలాల్‌ను పలకరించి, యోగక్షేమాలు కనుక్కొన్నాడు. షాపులో చోరీపోయిందనీ, పోలీసుఘర్షణ జరిగిందనీ విని చాలా విచారించాడు.

కుశలప్రశ్నలు వేసుకోవటం అంతా ఐనతరువాత, 'భాయీ, బాబూలాల్!— ఇవాళ ఇంటివద్దనుంచి తంతి వచ్చింది. ఈ మెయిల్లో జరుగురుగా నేను మావూరు పోతున్నాను. నిన్న సాయంత్రం ఇక్కడ పెట్టిపోయిన సామాన్లు పెట్టె తెప్పించుతారా?' అని అడావిడిగా అడిగాడు.

అప్పుడు బాబూలాల్ అధికారివద్దకు పోయి, ఫలానా పెట్టెకు స్వంతదారు వచ్చాడనీ, దానిని వానికి ఇచ్చెయ్యటానికి ఉత్తరువు యిమ్మనీ కోరాడు. అధికారి వచ్చి పెట్టె పరీక్ష చేయగా, తాళంవేసివున్నది. 'సరే, పట్టుకొని వెళ్లు' అన్నాడు.

పెట్టె పట్టుకువెళ్లేందుకు బండివాళ్లు నలుగురు వచ్చారు. భారమైన ఆ పొడుగుపాటి జాజిపలకల పెట్టెను మొయ్యలేక మొయ్యలేక గుమ్మం యివతలదాకా ఎలానో లాక్కువచ్చారు. వాళ్ళు ఎంత జాగర్తగా ఎత్తినా, చెయ్యిజారి, పెట్టె కింద పడి, గొప్ప శబ్దమైంది.

శబ్దంతోపాటు మనిషికేక వినిపించింది. అధికారి ఆశ్చర్యపడి, ఆ పెట్టెను బద్దలు కొట్టించగా పెట్టెలోపల పడుకొనివున్న ఒక పిల్లవాడు కనిపించాడు. వాడిచుట్టూ సామానులు పొందికగా పేర్చివున్నాయి!!

ఆపెట్టెను పరిశోధించగా, తాళం వేసుకునే రంధ్రం పైకి కనపడినప్పటికీ, తాళం మట్టుకు లోపలినించే వేసుకునే ఏర్పాటు కలిగివున్నది.

ఇదంతా కనిపెట్టి చూస్తూన్న అధికారి ఈలకొట్టేసరికల్లా, పోలీసులు వచ్చి ఆ దర్జా




పురుషుణ్ణీ, పెట్టెలోపల పడుకున్న ఆ పిల్లవాడినీకైదుచేశారు.ఘూర్ఖానువిడిచిపెట్టారు.

తరువాత పూర్తిగా విచారణ జరిగింది. బాబూలాల్ కొడుకు పోయినవని చెప్పిన షాపుసామానులు అన్నీ అతడు దాఖలు చేసిన జాపితాప్రకారం ఆ పెట్టెలో దొరికినై. ఒక్కటీ పోలేదు.

కొన్నాళ్లనుండి పెద్ద వర్తకునిలాగా నటించి, నమ్మకం కలిగించి, మోసం చేస్తూవున్న ఈ కిలాడీలు ఇలానే దొంగనాటకమాడే పాతకేడీలని వెల్లడైంది.

నాటినుండీ ప్రతిపట్టణంలోనూ వర్తకులందరూ చాలా జాగర్తగా ఉంటూవచ్చారు.




అనగనగా ఒక వూరు. ఆ వూరిలో సరసాని సంగన్న తమ్ముడు రంగన్న అనేవాడు ఉంటున్నాడు.

అతడు రోజూ ఏడు పొలిమేరలు తిరిగి, ఏడు గడ్డిమోపులు తెచ్చి వెయ్యంగా, ఏడుదొడ్ల పశువులు మెయ్యంగా, అవి ఇచ్చే పాలను ఏడువూళ్ళజనం అమ్ముకు జీవిస్తూ వచ్చారు.

ఒక రోజున, మన రంగన్న గడ్డిమోపులు తెచ్చి ఇంటిదగ్గర పడవేసి, 'వదినా!-కాసిన్ని మంచినీళ్లు ఇవ్వు' అన్నాడు.

అందుకు వదినె 'ఓహో!—నీవుగాంగ తెచ్చినావీ మహా లావుమోపు. ముంచుకు తాగవయ్యా' అన్నది.

రంగన్న నిర్ఘాంతపోయాడు. 'అరె, నేను ఏడు పొలిమేరలు తిరిగి ఏడు గడ్డిమోపులు తెస్తే, ఏడు దొడ్ల గేదెలు మెయ్యంగ, ఏడు వూళ్ళ జనం వాటి పాలను అమ్ముకు జీవిస్తున్నారే. ఇంతగా కష్టపడ్డా నాకు మా వదిన మంచినీళ్లయినా ఇచ్చింది కాదే' అనుకుని, తనంతట తనే నీళ్ళు ముంచుకు తాగి,—అడవివెంట వెళుతున్నాడు!

కొంతదూరం వెళ్ళేసరికి, ఒక రయితు కాళ్ళు నాగలిమీదా, మెడ మేడిమీదా పెట్టి నవ్వుతూ అరక దున్నుతున్నాడు.

రంగన్న చూచి 'ఓ రైతా!–నేను వెళ్లటం నీకూ ఆశ్చర్యంగా ఉన్నట్టుందే!' అన్నాడు.

'నీవు వెళితే నాకేమయ్యా?' అన్నాడు రైతుకుర్రవాడు.

'అయితే, మరి నీవెందుకు నవ్వుతున్నావు?' అని అడిగాడు, రంగన్న.

'అఁ–ఏమీ లేదు. గోల్కొండదగ్గర వీధి నాటకం వేస్తున్నారు. అక్కడ హాస్యంచూసి నవ్వుతున్నా' నన్నాడు రైతుకుర్రవాడు.

'ఐతే, నువు చాలా గొప్పవాడివల్లే వున్నావే!' అన్నాడు రంగన్న.

దేవభక్తుని రామమోహనరావు — వీరులపాడు — జగ్గినేని రామనాధమురావు.

అందుకు రైతుకుర్రవాడు, 'నేనేమి గొప్పలే! యెక్కడో సరసాని సంగన్న తమ్ముడు రంగన్న చాలా గొప్పవాడంట !!' అని చెప్పాడు.

"ఓయి, నీయిల్లు బంగారంకానూ, ఆ సరసాని సంగన్న తమ్ముడు రంగన్నను నేనేనోయ్!" అన్నాడు రంగన్న.

'అయితే, నేనూ నీవెంటవస్తా'నంటూ, రైతుకుర్రవాడు రంగన్న వెంటబయల్దేరాడు.

అలా కొంతదూరం వెళ్లినతరువాత ఒక మంగలిచిన్నవాడు కనిపించాడు. అతడు కాశీతీర్థం రామేశ్వరానికీ, రామేశ్వరతీర్థం కాశీకీ నిద్రచేయకుండా తీసుకవస్తున్నాడు.

రంగన్న ఆ చిన్నవాడిని చూచాడు. ఆ మంగలిచిన్నవాడు చేస్తూవున్న పనికూడా చూచాడు. చూచి, 'నీవు చాలా గొప్పవాడిలాగా ఉన్నావే!' అన్నాడు.

అందుకు ఆ చిన్నవాడు 'నేనేపాటి గొప్పవాడిని? ఎక్కడో సరసాని సంగన్న తమ్ముడు రంగన్న యెంతో గొప్పవాడని అందరూ అనుకుంటారు' అని చెప్పాడు.

'ఆ రంగన్నని నేనేనోయ్' అని చెప్పగా, మంగలి చిన్నవాడూ రంగన్నవెంట బయల్దేరాడు. ముగ్గురూ కలిసివెళుతున్నారు.




వెళ్ళగా వెళ్ళగా, కొంతదూరంలో ఒక ఎరుకల పిన్నవాడు నవ్వుతూ కనిపించాడు.

వాడినిచూచి రంగన్న 'అబ్బాయీ! మేమువెళ్ళటం నీకుకూడా ఆశ్చర్యంగానే వున్నదా?' అనిచెప్పి అడిగాడు.

అందుకు ఆ ఎరుకల పిన్నవాడు 'మీరు పోతే నాకేం?' అని బదులుచెప్పాడు.

'ఐతే, మరి ఎందుకు నవ్వుతున్నావు?' అంటూ మళ్ళీ అడిగాడు రంగన్న.

'ఏమీలేదు. నేను ఏడు నెలలనాడు బాణం వదిలితే, అది యిప్పుడు ఒక పిట్టని చంపి తెస్తున్న'దన్నాడు.



"అయితే, నీవూ చాలా గొప్పవాడల్లేనే ఉన్నావే!" అన్నాడు రంగన్న.

అప్పుడు ఆ పిన్నవాడు 'ఓ దొరా!— నేను ఏమి గొప్ప? ఎక్కడనో సరసాని సంగన్న తమ్ముడు రంగన్న ఉన్నాడంట, అయన చాలా గొప్పవాడంట!' అన్నాడు.

'ఆ రంగన్నని నేనేనోయి అబ్బాయి!' అని చెప్పేసరికి, ఆ ఎరుకలపిన్నవాడు కూడా రంగన్నవెంట బయల్దేరాడు.

ఇలా నలుగురూ వెళుతూవున్నారు.

వారు వెళుతూ వెళుతూ ఒక రాజుగారి పట్టణం చేరుకొన్నారు. ఆ పట్టణంలో పరిస్థితి యెలావున్నదీ అంటే—

పట్టణం ఏలే రాజుకు రాచపుండు పుట్టింది. 'నయంచేసినవాళ్ళకు మా అమ్మాయినిచ్చి పెళ్ళిచేసి, అర్ధరాజ్యంతో పట్టంకడతాం' అంటూ చాటింపించారు.

ఈ చాటింపు విని, వాళ్ళు నలుగురూ ఆలోచించుకున్నారు.

ఆలోచించుకొనేటంతలో రంగన్న లేచి మంగలిచిన్నవానితో ఇలా అన్నాడు: 'ఓయీ మంగలిచిన్నవాడా!— నీవు కాశీతీర్థం రామేశ్వరానికీ, రామేశ్వరతీర్థం కాశీకి తెచ్చేవాడివికద! ఇప్పుడు సత్వరంగా వెళ్ళి, ఆ తీర్థం తీసుకురావలిసిం'దని చెప్పాడు.

'సరే' నంటూ మంగలిచిన్నవాడు బయల్దేరిపోయాడు. తీర్థం తీసుకువస్తున్నాడు. ఐతే—కాశీ పుట్టినప్పుడే నది పుట్టింది. నది పుట్టినప్పుడే పన్నెండుశిరస్సుల నాగేంద్రుడు పుట్టాడు. ఆ నాగేంద్రుడు కాశీపట్టణానికి కాపలా కాస్తున్నాడు. అందుచేత, తీర్థం తెచ్చే ఆ మంగలిచిన్నవాడిని కాటు వెయ్యాలని నాగేంద్రుడు వెనకాతలే వస్తున్నాడు. మంగలి చిన్నవాడు దానిని చూడనేలేదు. కొంతదూరం వచ్చేసరికి, పాము బుసలకి వాడు అలిసిపోయి, ఒక చెట్టుకింద విశ్రమించాడు.

ఆ పాము వచ్చిచూచి, నిద్రించేవాడిని చంపకూడదుకదా అని, చుట్టుచుట్టూ తిరుగుతున్నది.

ఇక్కడ ఇలా వుండంగా, అక్కడవాళ్లు 'ఇంకా మంగలి చిన్నవాడు రాలేదేమీ' అని అనుకొంటున్నారు.

ఇంతలో రంగన్న ఇలా అన్నాడు; 'ఓ రైతుకుర్రవాడా! నువ్వు అల్లంత దూరాన వుండే గోల్కొండలోని హాస్యం చూచి నవ్వావే! ఇప్పుడు మన మంగలిచిన్నవాడు ఎక్కడ వున్నాడో చూడు' అన్నాడు.




రైతుకుర్రవాడు చూచి ఇలా చెప్పాడు: 'ఇంకేముంది! మంగలి చిన్నవాడు నిదుర పోతూవున్నాడు. అతనిదగ్గర పన్నెండు శిరస్సుల నాగేంద్రుడు, లేవంగానే కాటు వేయాలని చూస్తూవున్నాడు,' అని చెప్పాడు.

అప్పుడు ఎరుకల పిన్నవాడిని పిలిచి ఇలా అన్నాడు రంగన్న:

'ఓ ఎరుకలపిన్నవాడా!— నీవు ఏడు నెలలనాడు వేసిన బాణం పిట్టని చంపి తెచ్చిందికద! నువు ఇప్పుడు, మన మంగలి చిన్నవాడిదగ్గర వున్న నాగేంద్రుణ్ణి చంప వలిసింది' అని. 'సరే' నని బాణం ఎక్కుపెట్టి వేసినాడు ఎరుకలపిన్నవాడు. అంబు పోయి పామును తునాతునకలు చేసివేసింది.

మంగలిచిన్నవాడు 'అబ్బా, యెంత నిద్రపోయాను!' అంటూ లేచి, పక్కకు చూచాడు. ఇంకేముంది, పన్నెండు శిరసుల నాగేంద్రుడు తుండెతుండేలుగా పడివుండె!

సరేననుకుని, అక్కడినుండి లేచి, మళ్లీ కాశీవెళ్లి తీర్థం తీసుకవచ్చి, రాజుగారి రాచ పుండుకి మూడుమార్లు రాశాడు, మంగలి చిన్నవాడు. పుండు మానిపోయింది.

అప్పుడు రాజుగారు 'అయితే, మీ నలుగురిలో మా అమ్మాయిని యెవరు పెళ్ళిచేసుకుంటారూ?' అని అడిగారు.

అందుకు యెరుకలపిన్నవాడు 'ఓ రాజా!-మా అందరికంటె పెద్దవాడు సరసాని సంగన్న తమ్ముడు రంగన్న. అయనకే ఇచ్చి వివాహంచేయండి!' అన్నాడు. 'అలాగే' అన్నారు రాజుగారు.

రంగన్నకీ రాజకుమార్తెకూ మహా వైభవంగా పెళ్ళి జరిగింది.

మరి కొద్దిరోజులకల్లా రంగన్న పూనుకొని, తన స్నేహితులు ముగ్గురుకీ పెళ్ళిళ్లు చేశాడు. తరువాత వాళ్లు 'ఓ రాజా!— మేము మాయిళ్ళకు వెళ్ళుతా' మన్నారు.

'సరే' నన్నాడు రాజు.

అప్పుడు వాళ్లు ఒక సొరకాయ తెచ్చి, దానిలో బండ్లూ ఎడ్లూ సామానులూ అమర్చి, తరువాత భార్యాభర్తలూ కూర్చొని, 'రాజా!—ఈ సొరకాయలోకి నీళ్ళు రాకుండా, వాడి కీలు రాయించి సముద్రంలో వదలిపెట్టించండి' అన్నారు.

అలాగే చేశాడు రాజు.

సొరకాయ సముద్రంలో పోతూవుంటే దానిని ఒక చేప మింగింది. ఆ చేప అలా పోతూవుంటే దానిని ఒక కొంగ మింగింది. మింగి, ఒక చెట్టుమీద కూర్చున్నది.

కొంగ కూర్చోంగానే ఆ చెట్టుకొమ్మ పళపళమని విరిగి చక్కాపోయింది.

ఇంతలో సరసాని సంగన్న భార్య నదికి నీళ్ళకొచ్చింది. చచ్చిపడివున్న కొంగను చూచి, ఎడమచేతితో ఇంటికి తీసుకెళ్ళి కోసింది. కోస్తే దానిలోపల చేప అగుపడింది. చేపను కోసింది. లోపల సొరకాయ కనిపించింది. కాయ పగలగొట్టింది.

పగలగొట్టేసరికి, అందులో ఉన్నవాళ్లంతా బయటికి వచ్చేశారు.

అప్పుడు రంగన్న, వదినను చూసి సిగ్గుపడి ఇలా అన్నాడు: 'వదినా, నీవు చాలా గొప్పదానివి. నేనేమి గొప్పవాడిని!' అంటూ, తల వంచుకున్నాడు.

కథ కంచికి, మనమింటికి.






పుష్కరద్వీపం, క్రౌంచద్వీపం ఇరుగు పొరుగులు. క్రౌంచద్వీపపు రాజుకు అన్ని దేశాల రాజులూ మిత్రులయ్యారుగాని పుష్కరద్వీపరాజు మాత్రం కొఱకరాని కొయ్యగా ఉండిపోయాడు. అతన్ని బుట్టలో వేసుకోవటం ఎలాగా అని ఆలోచనలో పడ్డాడు క్రౌంచద్వీప ప్రభువు.

ఈ పని నిర్వహించటానికి సమరుడు ఎవరూ అని ఆలోచించి, చివఱకు మహా మంత్రి అయిన దూరదర్శిని పుష్కర ద్వీపానికి రాయబారిగా పంపాడు.

పుష్కరద్వీప రాజుకు తను మహా తెలివితేటలు గలవాణ్ణి అని విపరీతమైన గర్వం, అహంభావమున్నూ. అందుచేత, ఆ వచ్చిన దూరదర్శిని హడలగొట్టి సాగనంపాలని అనుకొన్నాడు.

దూరదర్శి కోటసింహద్వారం దగ్గఱకు వచ్చాడో లేదో, భటులు గబగబా తలుపులు మూసివేశారు. సింహాసనంమీద ఠీవిగా కూర్చొని ఇదంతా చూస్తున్నాడు మహారాజు.

రాజును చూడగానే దూరదర్శి క్రింద నుంచే వందనం చేశాడు. రాజు వెకిలిగా నవ్వుతూ 'ఏయ్ మంత్రీ! అదిగో ఆ పెద్ద తలుపులకు పక్కగా కుక్కలు ప్రవేశించే కంత ఉన్నది. అందులోనించి దూరి రావయ్యా పైకి' అన్నాడు, సింహాసంలో కూర్చొనే. చుట్టూ వున్న పరివారమంతా 'భలే భలే' అన్నారు.

అప్పుడు మహామంత్రి 'చిత్తం, హుజూర్' అంటూ 'ప్రభూ! మీది ఎవళ్ళకు సంబంధించిన దేశమైతే వాళ్ళందరూ పోయే ద్వారాన్నే పోతాం. మనుష్యుల దేశమైతే వాళ్ల వాకిలిగుండా వెళ్తాం. మీది కుక్కల రాజ్యం అయితే ఆ ద్వారంగుండా రావటానికి నాకేం అభ్యంతరంలేదు' అని చల్లగా అనేసరికి రాజుమొఖం తెల్లబడింది.

కె. సత్యవతి - కర్నూలు

'అరే, తప్పించుకున్నాడురా!' అనుకొని రాజు వానిని సింహద్వారాన్నే రప్పించి, కుర్చీ వేయించి పక్కన కూర్చోపెట్టుకొన్నాడు.

చూస్తే, దూరదర్శి చాలా పొట్టివాడు. ఆ కుర్చీలో సగానికైనా రాలేదు. మళ్ళీ అవమానించాలని మనసుపుట్టి 'ఏమయ్యా! మంత్రీ! మీ బుద్ధులకుమల్లేనే మీరాజ్యంలో మనుషులూ పొట్టివాళ్లేనా?' అన్నాడు రాజు.

రపీమని మంత్రి సమాధానంచెప్పాడు: 'రాజా! మాదేశంలో రకరకాల మనుషులున్నారు. మఱి, మారాజ్యంలో యింకొక నియమంకూడా ఉంది. అల్పులదగ్గఱకు పొట్టివాళ్లనీ, గొప్పవాళ్ల దగ్గరకి పొడుగువాళ్ళనీ పంపాలనేది మా దేశాచారం. అందుకనే నన్నిక్కడికి పంపారు' అనగానే రాజుపని మతాబా కాల్చినట్టయింది.

'అరి, వీడితస్సాదియ్యా!' అనుకొని, అతనికి ఎలా తలవంపు కలిగించటమా అని సమయంకోసం ఎదురుచూస్తున్నాడు, రాజు. ఇంతలో కొందరు భటులు ఒక ఖైదీని పట్టుకొనివచ్చి వీడు పుష్కరద్వీపపువాడనీ, దొంగతనంచేశాడనీ ఫిర్యాదుచేశారు. 'ఏమయ్యా మంత్రీ, మీరాజ్యంలోవాళ్లందరూ చోరులేనా ఏమిటి?' అన్నాడు రాజుగారు హేళనగా.

మంత్రిమాత్రం తక్కువవాడా? 'అది కాదు మహారాజా! అది గడ్డ తీరు. ఏ గడ్డ మీద ప్రవేశిస్తే ఆ బుద్ధులే పుడతయ్. మీ రాజ్యంలో మావాడికి దొంగతనం అబ్బింది గాని మాదేశంలో దొంగతనమనేదే లేదు' అన్నాడు మహామంత్రి. దెబ్బతో రాజుగారికి నసాళానికంటింది. 'ఈ పుష్కరద్వీపపు వాళ్ళతో కయ్యంపెట్టుకు నెగ్గలేమురా' అనుకొన్నాడు. అప్పుడు మంత్రిని బహుమతి కోరుకొమ్మనేసరికి 'రెండు రాజ్యాలూ మైత్రిగా ఉండటమే నాకు కావలిసిం' దన్నాడు దూరదర్శి. అదిమొదలు రెండు రాజ్యాలూ స్నేహంగా ఉంటూవచ్చినయ్.



1



2



# నేటి పాపలు  రేపటి పౌరులు





3

4

1. బేబీ నిర్మల
2. చి॥ కల్యాణకుమారి
3. చి॥ త్యాగమోహన్
4. చి॥ శ్రీనివాసమూర్తి

## అట్టమీది బొమ్మ

నల్లత్రాచు పాములచే కరిపించినప్పటికీ భీముడు లెక్కచేయక, బతికి బయట పడటం దుర్యోధనాదులకు చించుకున్నట్టయింది.

వీడిని ఎలా నాశంచేయటమా అనే సమస్య వేధింపసాగింది. అప్పుడు, కౌరవపక్షానికి మొనగాళ్లయిన దుర్యోధనుడు, శకుని, కర్ణుడూ, కలిసి తీవ్రంగా ఆలోచించారు. ఒకటి గాకుంటే మరొకటైనా ఫలించదా అని చెప్పి, వారు లక్ష వ్యూహాలు పన్నుకొని కూర్చున్నారు.

భీముడు తిండిపోతు అనీ, వానికి లడ్డూలు యిష్టమనీ తెలిసి, విషపులడ్డూలు ప్రత్యేకించి తయారుచేయించారు. వీటితోనూ, మరికొన్ని అపురూపమైన భక్ష్యాలతోనూ గంగఒడ్డున వారు గొప్ప విందు ఏర్పాటుచేశారు.

అక్కడ వారందరూ ఆటలాడినంత సేపూ ఆడి, విందు ప్రారంభించారు. విషపులడ్డూలు తింటూన్న భీమునివైపు కౌరవ పక్షీయులు చూచారు. అతనిలో ఏమీ మార్పులేదు. ఆ లడ్డూలు తిని, జీర్ణించుకొని, మునపటికంటె ఉత్సాహంతో వున్నాడు. తరువాత హాయిగా నిద్రించాడు.

నిద్రిస్తూవున్న భీముణ్ణి వారు ఆకస్మికంగా కట్టి, గంగలో తోసివేశారు. ఇప్పుడు భీముడు గంగలో పడిన చోటునకు అడుగున సూదిమొనలు గల అనేకమైన త్రిశూలాలు అమర్చివున్నాయి!

ఇలా పడిపోయిన భీముడు పాతాళలోకం చేరుకొన్న తరువాత మెలకువ వచ్చి, 'ఇదేమిటబ్బా!—వళ్ళు చల్లగా ఉన్నట్టుందే...' అనుకొన్నాడు.

అక్కడ నాగలోకవాసులు భీమసేనుని ఎంతగానో ఆదరించారు. అతడు పంచ పాండవులలో ఒకడని తెలిసి, చాలా సంతోషించారు.

వారు ఇచ్చిన సిద్ధరసం సేవించగానే భీమునికి వెయ్యి ఏనుగుల బలం వచ్చింది.

తరువాత నాగుల దీవనలందుకొని. కొత్తతేజస్సుతో ఇంటికి చేరుకునేసరికి, భీమునికోసం బెంగపెట్టుకొనివున్న అతని ఆత్మీయులంతా సంగతి సందర్భాలు తెలుసుకొని, ఆశ్చర్యపోయి, 'ఇదీ వకమంచికే...' అనుకొన్నారు.

ఎవరెన్ని ఆపదలు తలపెట్టినా, భీమసేనుడు చెక్కుచెదరలేదు.

బెంగతో తల్లడిల్లిపోతూవున్న పాత ఫాదుషాకు అకస్మికంగా ఒక అమరగానం మళ్ళీ వినిపించింది. ఈ పాట సహజంగా బుల్‌బుల్‌కు దైవం నేర్పిన పాటకాని, కృత్రిమపుపాట కాదు.

అలా పాడుతూ గదిలోపలికి వచ్చి, యాంత్రికపక్షికి పక్కనే వాలింది ఇప్పుడీ అమరగానం చేసిన అసలు బుల్‌బుల్. 'దేవలోకంనించి దిగివచ్చిన బుల్‌బుల్! నిన్ను నా రాజ్యంనుండి తరిమివేసి పాపం కట్టుకొన్నాను. నామాట విని, యిప్పుడు మళ్లీ నాదగ్గరకువచ్చి నన్ను సంతోషపెట్టావు. దుష్టులను దూరం చేశావు. మృత్యువునుసైతం పారదోలావు. నీ ఋణం ఎలా తీర్చుకొనగలనో కదా!' అన్నాడు జాలిగా.

ఇలా అంటూవుండగా, ఫాదుషా కన్నులనుండి జలజలమని బాష్పాలు రాలినై. అప్పుడు బుల్‌బుల్ 'రాజా! నాపట్ల నీ ఋణం తీరేపోయింది. నేను మొట్టమొదట గానంచేసినప్పుడు హృదయం కరిగి బాష్పాలు రాల్చినావు. మళ్ళీ ఇప్పుడు రాలుస్తున్నావు' అన్నది. ఈ విధంగా చెబుతూ అది హాయిగా గానం చేసేసరికల్లా ఫాదుషా మైమరచి గాఢనిద్ర చెందాడు. ఉదయానికల్లా నిర్మలంగా, ఆరోగ్యవంతంగా, మేల్కాంచాడు.

## అట్టచివరి బొమ్మ

ఫాదుషా మేలుకొనేసరికి పరిచారకులెవ్వరూ లేరు. అందరూ కొత్త ఫాదుషా కొలువులో ఉన్నారు. కాని, ఇక్కడ కిటికీ పైన కూర్చుని అమరగానంచేస్తున్న అసలు బుల్‌బుల్ మాత్రం వున్నది. అప్పుడు ఫాదుషా దానితో 'బుల్‌బుల్!—నీవు నావద్దనే వుండిపో. ఈ యాంత్రికపక్షిని వెయ్యిముక్కలు చేసివేస్తా' నన్నాడు, కోపంగా. 'ప్రభూ! వద్దు. ఒక్క వాగ్దానమిస్తే, నీవు పిలిచినప్పుడల్లా వచ్చి నేను పాడుతూవుంటాను' అన్నది.

వెంటనే ఫాదుషా లేచి, రాజదుస్తులు ధరించి, ఖడ్గం చేతబట్టి, 'బుల్‌బుల్!—నీకేమి కావాలో కోరుకో' అన్నాడు.

'నేను ఇక్కడ ఉన్నట్టు ఎవళ్ళకూ తెలియనీయకు. ఇదే నా కోరిక' అంటూ అది చెట్టుమీదకు ఎగిరిపోయింది.

అంతలో పరివారంవచ్చి పాతఫాదుషా రాజదుస్తులు ధరించివుండటం చూచి, ఆశ్చర్యపోయారు! ఫాదుషా ఎవళ్లనూ కోపపడలేదు. తరువాత అనేకవందల సంవత్సరాలు పర్షియాదేశం పాలించాడు. అంతకాలమూ ఆ అసలు బుల్‌బుల్ వచ్చి, వాగ్దానంప్రకారం అమరగానంచేసి ఫాదుషాకు ఉత్సాహం కలిగిస్తూవుండేది.

# ఇంద్ర

## చూ - చిన్ - చౌ

ఈ ఇంద్రజాలానికీ - ఇదివరలో ప్రకటించిన 'చైనాకూజా' ఇంద్రజాలానికీ చాలా దగ్గిరసంబంధం ఉంది. 'చైనా కూజా'లో మాదిరిగా రంగుకూజా కాకుండా దీనికి లోపల పోసిన బియ్యం పైకి కన్పించేట్లు స్వచ్ఛమైన తెల్లకూజా ఉపయోగిస్తే బావుంటుంది. మిగిలినఅంశాలో ఈ రెండు గారడీలూ ఇంచుమించు ఒకటే.



దీని విధానం ఇది: తెల్లటి కూజా ఒకటి తీసుకొచ్చి దానినిండా బియ్యంపొయ్యాలి. బియ్యం ఇంచుమించు నిండాపోశాక ఐంద్రజాలికుడు 'చాప్‌స్టిక్'ను అందులో గుచ్చాలి.



ఐంద్రజాలికుడు గుచ్చేటప్పుడు మాయ మంత్రాలు చదివితే ఆ స్టిక్ అందులో ఇరుక్కు పోతుంది.

తర్వాత ఆ స్టిక్‌ను పట్టుకుని పైకియెత్తితే దానితోపాటు కూజా కూడా పైకి లేస్తుంది. నేను చాప్‌స్టిక్‌కు బదులు మాయదండాన్ని ఉపయోగించేవాడిని. ఇది వినటానికి ఎంతో ఆశ్చర్యంగా ఉన్నప్పటికీ, చెయ్యటానికిమాత్రం చాలా సులభం. నా ఉద్దేశంలో ప్రతి కుర్రవాడూ దీన్ని చెయ్యవచ్చు.

ఇందులో కిటుకుఏమీలేదు. బియ్యం నింపిన కూజాలో ఈ చాప్‌స్టిక్‌ను గట్టిగా నొక్కి లోపలికి పోనిస్తే దీనిచుట్టూ ఉండే బియ్యపుగింజలు కూజాలో ఏమాత్రం ఖాళీ అనేది

# జాలము

లేకుండా సర్దుకుంటాయి—కనుక స్టిక్ దానంతటదే అందులో అడ్డుకుంటుంది.

చూడవచ్చిన ప్రేక్షకులు ఈ సహజమైన సత్యాన్ని ఊహించలేరు. తర్వాత చాప్‌స్టిక్‌ని త్రిప్పిలాగితే దానంతటదే



వస్తుంది. మిగిలినదంతా సులభమే. ఆ కూజా, స్టిక్కు, అందులోపోసిన బియ్యం ప్రేక్షకులకు పరీక్షకోసం ఇవ్వవచ్చు. ప్రేక్షకులలో మళ్ళీ ఎవరైనా కుతూహలంతో ఈ ఇంద్రజాలాన్ని చెయ్యాదలచుకుంటే అక్కడే చెయ్యావచ్చు. ఇందులో కిలకం ఏమీ లేదని వారి కప్పుడే తెలుస్తుంది. కాని ఇంత సులభమైనది తమకు అంతవరదాకా తెలియకపోయినందుకు ప్రేక్షకులకు తప్పక ఆశ్చర్యమూ వేస్తుంది.

ఈ ఇంద్రజాలాన్ని చైనీయులు చూ-చిన్-చౌ అనే పేరుతో వ్యవహరిస్తారు.

---

ఈ గారడినిగురించి పాఠకులు ఇంకా వివరంగా తెలుసుకోదలి 'చందమామ' పేరు ఉదహరిస్తూ నరాసరి ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషుబాషలోనే వ్రాయాలి. ఇది ముఖ్యం.

అడ్రెసు : ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్

**12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్ కలకత్తా - 19**

## నిన్న - నేడు - రేపు



ఒక లండన్ టీషాపులో ఒక భారతీయుడు, ఒక బ్రిటిష్ దేశస్థుడు, ఒక నీగ్రో కలిసి టీ పుచ్చుకొంటున్నారు. మూడుకాలాలలోను ఏది మంచిదీ అని ప్రశ్న వచ్చింది. అందుకు ఆ ముగ్గురూ మూడు రకాల జవాబులు చెప్పారు :

భారతీయుడు : మా దేశపు పూర్వపు ఔన్నత్యం చాలా గొప్పది. కనుక పూర్వకాలమే మాకు మంచిది.

బ్రిటిష్‌దేశస్థుడు : మాకు పూర్వపు ఔన్నత్యమూ లేదు. రేపటి మాట చెప్పనూ లేము. కనుక నేడే మంచిది.

నీగ్రో : మా దేశం నిన్నటివరకు అనాగరకమై వుండె. నేడుకూడా వెలుగు ఏమీ కనబడదు, కనుక మంచి ఏమైనా వుంటే ముందుకాలంలోనే.

---

గతనెల చందమామ 12-వ పేజీలోని 'తప్పుపట్టండి' బొమ్మకు సమాధానాలు :

1. రెప్పలమీద కనుబొమలుండాలి.
2. నిమిషాలుచూపే గీతలు ఉండాలి.
3. పెన్సిలు అడుగున ముల్లు ఆనవాలు తెలియాలి.
4. ఫ్రేముకూ అద్దాలకు కలిపే స్క్రూ ఉండాలి.
5. రోజాపువ్వులకు గులాబి ఆకులే ఉండాలి.
6. నీటిమట్టం గుండ్రంగా కనబడాలి.
7. గాడిదకు తోక పొడవుగా ఉండాలి.
8. మొసలికి ఇంకా రెండు కాళ్లు ఉండాలి.
9. ఆవుకు మరిరెండు చనుకట్లు ఉండాలి.

## ఫొటో వ్యాఖ్యల పోటీ

జనవరి ఫొటోల ఫలితాలు



జనవరినెల చందమామలో ప్రచురింపబడే ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు :

మొదటి ఫొటో : టాకీలు

రెండవ ఫొటో : మూకీలు

పంపినవారు :

జి. సుబ్బదాసు - టంగుటూరు

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపిన వారి పేరుతోసహా జనవరి చందమామ ఫొటోల దిగువన ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- జనవరి సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.



### ఫిబ్రవరి నెలలో

ప్రచురింపబడే ఫొటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్కపేజీలో చూడండి

---

ఒక ముఖ్యసూచన :

మీరు పంపదలచుకున్న వ్యాఖ్యలు కార్డు పైననే వ్రాసిపంపాలి. కొందరు కాగితంపైన వ్రాసి కవరులో పంపుతున్నారు. ఇలాంటివి పరిశీలింపబడవు.

# ఫొటో వ్యాఖ్యల పోటీ

ఫిబ్రవరి 1953 :: బహుమానం రూ. 10/-





ఫిబ్రవరి సంచికలో వచ్చే ఫొటోలు రెండూ పైన చూడండి.
వీటికి సరియైన వ్యాఖ్యలు కావాలి. వివరాలు యివి:—

1. వ్యాఖ్య ఫొటోకు సరిపడేటట్లు వుండాలి.
2. ముచ్చటైన ఒక్కమాటలోగానీ, రెండు మూడు మాటలుగల ఒక చిన్ని వాక్యంలో గానీ వ్యాఖ్య ఉండవచ్చు.
3. అన్నిటికన్న ముఖ్య విషయం: మొదటి ఫొటోకూ, రెండవ ఫొటోకూ కూర్చేవ్యాఖ్యలు రెండూ ఒకదానికొకటి సంబంధించివుండాలి.
4. ఒక్కొక్కరు ఒక్కొక్క సెట్టు వ్యాఖ్యలకంటే ఎక్కువ పంపకూడదు.
5. ఒక కార్డుపైన మీ వ్యాఖ్య, పూర్తిపేరూ, విలాసమూ వ్రాసి, మాకు పంపాలి.
6. డిశంబరు 15-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ఆ తర్వాత చేరిన వ్యాఖ్యలు పరిశీలించబడవు.
7. మాకు చేరిన వ్యాఖ్యలలోకెల్లా అత్యుత్తమంగా వున్న సెట్టుకు (అనగా రెండువ్యాఖ్యలకు కలిపి) రూ. 10/– బహుమతి ఇవ్వబడుతుంది.

వ్యాఖ్యలు పంపవలసిన అడ్రసు:

ఫొటో వ్యాఖ్యల పోటీ:

**చందమామ పబ్లికేషన్స్**

వడపలని పోస్టు :: మదరాసు - 26.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him from Chandamama Publications, Madras 26, Controlling Editor : SRI CHAKRAPANI

Photo by B. Ranganathan



బహుమతి
పొందిన వ్యాఖ్య

'ప్రధానం'

పంపినవారు:
జి. వి. రమణ - అనంతపురం




రంగులబొమ్మ కథ — 6 - వ బొమ్మ